THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS.



# ఆంధ్రపత్రిక



Regd. No. M, 5745 సంపుటం 38. సంచిక 179
FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO.
ఆదివారం 30-9-1951 వెల 2 అణాలు, హోలీ 0-2-4.

# విజయవాడలో రేపు 3-న స్వామీజీ భవిష్యత్ కర్తవ్య వివరణ

## పర్షియా నూనె తగాదాపై భద్రతా మండలికి ఫిర్యాదు

### బ్రిటిష్ ప్రభుత్వ నిర్ణయం

లండన్, సెప్టెంబరు 28 : పర్షియాలో ఏర్పడిన నూనె తగాదాను సమితి భద్రతామండలికి నివేదించడానికి నిశ్చయించినట్లు బ్రిటిష్ ప్రభుత్వం నేటి రాత్రి ప్రకటించింది.

అదే సమయంలో దక్షిణ పర్షియాలోని నూనె గనులలో నూనె ఉత్పత్తి చేసి ఇతరులకు విక్రయించకుండా పర్షియాను నిరోధించడానికి "తగిన చర్యలుకూడా జరపడమౌతుం"దని బ్రిటిష్ విదేశాంగ కార్యాలయం వెల్లడి చేసినది.

విదేశాంగ కార్యాలయం ఇంకా ఇట్లు ప్రకటించినది :

## న్యూయార్కుకు ఫ్రాంక్ గ్రాహంరాక

న్యూయార్కు, సెప్టెంబరు 28. డా॥ ఫ్రాంక్ గ్రాహం జెనీవానుంచి ...

డా॥ గ్రాహం ఈరోజే సమితి కార్యదర్శి ట్రిగ్వీలీని కలుసుకుంటాడు.

### హద్దుల అతిక్రమణ

శ్రీనగర్, సెప్టెంబరు 28: యుద్ధ విరమణ సరిహద్దులను అతిక్రమించి, కాశ్మీర్‌లో పాకిస్తానీలు వ్యవసాయానికి దిగిన ప్రదేశాన్ని సమితి పరిశీలకులు చూచివచ్చారు.

## ఆక్టోబరు ఆఖరున మంత్రి పదవినుంచి రాజాజీ విరమణ

### హోంశాఖపై ఎన్.జి.అయ్యంగార్ ఆధ్వర్యం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 28: అక్టోబరు నెలాఖరున హోం మంత్రి శ్రీ రాజగోపాలాచారి ఉద్యోగం విరమించుకో గలరని రూఢిగా తెలుస్తున్నది.

... చేరి, విశ్రాంతి పొందాలని భావిస్తున్నారు. డా॥ అంబేద్కర్ ఎన్నికలలో పాల్గొంటారు. ఆరోగ్యం బాగు పడినతర్వాత ఢిల్లీలో మకాం పెట్టి సుప్రీం కోర్టులో న్యాయవాది వృత్తిని అవలంబించ దలచుకున్నట్లు తెలుస్తున్నది.

అయితే, ఈ ఇద్దరి రాజీనామాలవల్ల ఏర్పడిన ఖాళీలను ప్రధాని ఇతరులను నియమించి భర్తీ చేస్తారని ఎవ్వరూ అనుకోవడం లేదు. శ్రీ కె. ఎం. మున్షీకి న్యాయశాఖను, శ్రీ గోపాలస్వామి అయ్యంగారికి హోంశాఖను ఇస్తారని అనుకుంటున్నారు. శ్రీ గోపాలస్వామి అయ్యంగారుకూడా ఎన్నికల్లో పోటీ చేసేటట్లు కనపడటం లేదు.

## న్యాయశాఖ మంత్రి అంబేద్కర్ రాజీనామాకు నెహ్రూ ఆమోదం

### మంత్రివర్గంలో కొన్ని మార్పులు జరిగే సూచన: కిద్వాయ్‌గారి పునఃప్రవేశ అవకాశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 28 : ...

### పర్షియారాజుకు ట్రూమాన్ లేఖ

### హరిమన్‌ను పంపే తలంపు లేదట

## 'గుంటూర్లో మురుగు నీటిపారుదల సౌకర్యాలు వెంటనే జరగాలి'

### పురపాలక సంఘ నివేదికపై జిల్లా కలెక్టర్ వైద్యనాథన్ గారి రిమార్కులు

గుంటూరు, సెప్టెంబరు 27: పురపాలక సభ్యులు నేను సైర్కుల్ వి. వి. పున్నయ్యగారి అధ్యక్షతను సమావేశమై 1950-51 పురపాలక నివేదికపై జిల్లాకలెక్టరుగారు వ్రాసిన దిగువ రిమార్కులను రికార్డు చేశారు.

ప్రజారోగ్యాన్ని గూర్చి కలెక్టరు దిగువ రిమార్కు వ్రాసారు: పట్టణంలో మురుగు పారుదల పారిశుధ్యము ఎంతమాత్రమూ సంతృప్తికరంగా లేదు. కొన్నిచోట్ల విసవకుండా దుర్వాసన కొట్టుతున్నది. దీనిని తొలగించడానికి ఏమాత్రపు ప్రయత్నమూ జరిగినట్లు తోచదు. ...

... మురుగుపారుదలకు సర్వే రమే ఏర్పాట్లుచేయాలి. పేదల నివాసాలస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. కనీసం మూసిమూసిన మార్గాలలోనైనా మురుగు పారేట్లు చేయటం అవసరం."

పట్టణంలోని రోడ్లను అభివృద్ధిచేసే అవకాశం యింకా ఎంతైనావున్నదని కార్తిపాడు రోడ్డుమీదవున్న రైల్వే గేటువద్ద 'ఓవర్ బ్రిడ్జి' వేయుటమ నేడు చిరకాలవాంఛితం. అది యికనైనా జరగాలి. మునిసిపాలిటీక్రింద 26 ప్రాథ ... మిక పాఠశాలలువున్నా వీటికి సరియైనభవనములుకట్టని కారణంచేత, పాఠశాలలుగా వుండటానికి ఏమాత్రపు అవకాశంలేని అద్దె యిండ్లలో యీ పాఠశాలలను నడుపుతున్నారు. నిర్బంధ ప్రాథమికవిద్యను అమలుజరపాలి. ...

జిల్లా కలెక్టరుగారి పై రిమార్కులు ... హెల్త్ ఆఫీసరు డా॥ సి. రామచంద్రరావుగారిని కోరుతూ కౌన్సిల్ తీర్మానించింది. (స్వ. వి.)

## అదనంగా 60కోట్లు మిగులు

—(o)—

### దేశముఖ్ వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 29 : తాను బడ్జెట్టు అంచనాల సందర్భంలో అనుకున్నట్లుగాక భారత ప్రభుత్వం ఆయవ్యయం నిల్వ (1951 ఓపెనింగ్ నిల్వ) 60కోట్లు పెరిగిందని నేడు పార్లమెంటుకు ఆర్థికమంత్రి శ్రీ దేశముఖ్ తెలియ జెప్పారు.

ఈ సంవత్సరం బడ్జెట్టును ప్రతిపాదించిన సందర్భంలో ఈ నిల్వ 95 కోట్లుగా వుండవచ్చునని ఆయన అంచించారు. కాని నిజానికి అది నికరం 157 కోట్లు పైచిలుకువుంది.

## వినోబాభావేతో సంప్రదించిన మీదట కార్యక్రమనిర్ణయం

### రాష్ట్రసాధనవిషయంలో భావే పూర్తిబాధ్యత స్వీకరించిన సూచన

గుంటూరు, సెప్టెంబరు 29 : ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి యికపై బాధ్యత ఆచార్య వినోబాభావేగారు స్వీకరించినట్లు హైదరాబాదునుండి వస్తున్న వార్తలనుబట్టి తెలుస్తున్నది. రాష్ట్రస్థాపన వుద్యమమై భావి కార్యక్రమ నిర్ణయం ఆచార్య వినోబాగారితో సంప్రదించిమీదటే జరుగగలదని యిక్కడివారు విశ్వసిస్తున్నారు.

... స్వామీజీ అక్టోబరు 3 న విజయవాడలో హిందీ ముద్రణాలయానికి ప్రారంభోత్సవం చేస్తారు. ఆనాటి సాయంకాలమే జరుగనున్న బహిరంగ సభలో రాష్ట్రస్థాపనవిషయంలో తాము నిర్ణయించిన భావి కార్యక్రమాన్ని స్వామీజీ బహిరంగపరుస్తారని అనుకొంటున్నారు. నేటి వుదయం హిందీ ప్రచారకులు స్వామీజీని యిక్కడ కలుసుకొని ఆయనతో సంప్రదింపులు జరిపారు.

జలుబు భారము, గొంతు బాధ పూర్తిగా తొలగిపోయి స్వామీజీ ఆరోగ్యంగా వున్నారు. గాంధీ జయంతినాడు ఆయన వినయాశ్రమంలో వుంటారు. (స్వ. వి.)

### అక్టోబరు 7 న గుంటూరులో ఆంధ్రప్రజా పరిషత్తు

అక్టోబరు 7 న యిక్కడ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతను ఆంధ్ర ప్రజా పరిషత్తును సమావేశపరచటానికి అన్ని ఏర్పాట్లు చురుకుగా జరుగుతున్నాయని రాష్ట్రస్థాపక సంఘ కార్యదర్శి ఆమంచర్ల చలపతిరావు గారు ప్రకటించారు.

... స్వామి సీతారాం కోరిక మేరకు అక్టోబరు 2లోగా ఆంధ్రరాష్ట్రం అవతరించకపోతే తిరిగి సిద్ధికోసం అవసరమైన చర్యలను అమలు జరుపటానికి ఏర్పడ్డ యీ రాష్ట్రస్థాపక సంఘానికి ...

## కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ రద్దుకాదని కృపలానీ

### కలకత్తాలో కార్యవర్గసమావేశ నిర్ణయం

కలకత్తా, సెప్టెంబరు 28: ప్రజాపార్టీ పూర్వంలాగా మామూలుగా పనిచేస్తూనే వుంటుంది. దాన్ని రద్దుచేయడం అన్నప్రశ్నే లేదు అని నేడు ఆ పార్టీ కార్యవర్గం ఇచ్చట సమావేశమై నిశ్చయం చేసింది.

సమావేశం అనంతరం పార్టీ నాయకుడు శ్రీ ఆచార్య జె. బి. కృపలానీ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ఈ విషయాన్నే పునరుద్ఘాటించారు. ఈ సమావేశం కిద్వాయి కోరికను పురస్కరించుకొని జరుగుతున్నదని ఆయన ఇంకా ప్రజాపార్టీని వదిలిపోలేదని, ఈ విషయమై ఇంకా చర్చలు జరగగలవని ఆచార్య కృపలానీ ఈ సందర్భంలో వెల్లడిచేశారు.

ఈ సమావేశం ఆచార్య కృపలానీ అధ్యక్షతను డా॥ పి. సి. ఘోష్ ఇంట్లో జరిగింది. డా॥ ఘోష్, శ్రీమతి సుచేతకృపలానీ, శ్రీ త్రిలోకీ సింగ్, శ్రీ ఎస్. కె. డి. పల్లివాల్, ప్రొఫెసర్ సిబ్బన్‌లాల్ సక్సేనా, శ్రీ దామోదరమీనన్, సాదిక్ అలీ, శ్రీ గోవిందసహాయ ప్రభృతులు హాజరైనారు. సమావేశం నేడు మూడు గంటలపాటు జరిగింది. రేపు తిరిగి జరుగుతుంది.

కాంగ్రెసు హైకమాండు స్వరూపము మారింది కాబట్టి, తాము గూడా మారాలేమో చర్చించడం అవసరమని రఫీ అహ్మద్ కిద్వాయీ కోరినందువల్ల ఈ సమావేశం ఏర్పాటు చేయబడి నట్లు ఆచార్య కృపలానీ సమావేశానంతరం పత్రికా విలేఖరులతో మాట్లా ...

అంతా ఏ సంస్థకోసం ధారపోశామో, ఆ సంస్థను విడిచివచ్చామనుకోవడం పొరపాటు. కాంగ్రెస్ అధ్యక్షునితో మాకువున్న తగాదా చాలా అల్పమైనది. అయితే అది గత నాల్గు సంవత్సరాలుగా రాజుకుంటున్న అగ్నిని రగల్చడానికి నిమిత్తమాత్రంగా తోడ్పడిందని ఆయన స్పష్టంచేశారు.

### కిద్వాయి వైఖరి

## డిల్లీ కాంగ్రెస్: స్పెషల్ రైళ్లు

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 28 : 8 వేలా పైచిలుకు ప్రతినిధులూ వారి కుటుంబాలూకాక దేశంలోని వివిధ ప్రాంతాలనుంచి యింకా వేలకువేల మంది ప్రేక్షకులు కాంగ్రెసు మహాసభకు రానున్నట్లు ఇక్కడి సన్మాన సంఘ కార్యాలయంలో లభ్యమైన సంగతులనుబట్టి తెలుస్తున్నది. ప్రత్యేక ఏర్పాట్లను కోరుతూ ప్రతినిధులు కానివారినుండి కుప్పతెప్పలుగా లేఖలు వస్తున్నాయి. ఈ ప్రతినిధులనూ, ప్రేక్షకులనూ ఎక్కించుకొని రావటానికి అప్పుతసర్ బొంబాయి, కలకత్తా, పాట్నా, కాన్పూరులనుండి స్పెషల్ రైళ్లు నడిపించే యేర్పాట్లుకూడా చురుకుగా జరుగుతున్నాయి. వీటన్నిటి యేర్పాట్లూ చేయడానికి సన్మాన సంఘం కత్తివంచనలేకుండా పాటుపడుతున్నది. ఈ కాంగ్రెసు ప్రత్యేక మహాసభ జరగనున్న సత్యవతీనగరులో ఒక స్పెషల్ తంతి తపాలా ఆఫీసు కూడా యేర్పడుతున్నారు.

## 'పంచాయతీఅధ్యక్షుడే ఎక్జిక్యూటివ్ ఆఫీసర్ కావాలి'

### వ్యయపరిచే డబ్బు మొత్తాలను పెంచాలి. రాష్ట్రమహాసభలో తీర్మానాలు

మదరాసు, సెప్టెంబరు 29: తృతీయ చెన్నరాష్ట్ర పంచాయితీల మహాసభ వారు నిన్న సాయంత్రం బహిరంగ సమావేశంలో ఈ క్రింది తీర్మానాలను ఆమోదించారు.

పంచాయితీల అధ్యక్షుడే ఎగ్జిక్యుటివ్ ఆఫీసరుగా కూడా వుండాలని, అధ్యక్షునికి సహాయ్యపడటానికి ఒక సెక్రటరీని సయితం ప్రభుత్వం నియమించవచ్చునని సూచింపబడింది.

పంచాయితీల అధ్యక్షులు కొందరు పంచాయితీల చట్టపు నిబంధనలను క్రమంగా అమలుపరచటానికి తగినంత విద్యావంతులు కాకపోవడం చేతను, ఇంటి పన్ను, బండ్ల పన్ను, వృత్తి పన్నులకు సంబంధించిన సర్వీసు నోటీసుపత్రాలు ముద్రణ సమానాపత్రాలు తగినంతగా లేకపోవుటవల్లను పై పన్నులు విధించడం 1952 ఏప్రిల్ 1 వరకు వాయిదా వేయవలెనని ప్రతిపాదించబడ్డ తీర్మానము ఆ విషయమై ప్రభుత్వం యిదివరకే ఈ ఉత్తరవు జారీ చేసినందున ఉపసంహరించడమైనది.

చిన్న పంచాయితీలు నిర్వహింపబూనే పనులకు వ్యయమును మంజూరు చేసే మొత్తం గరిష్ఠ ప్రమాణము రూ 250 నుండి వెయ్యికి పెద్ద పంచాయితీలకు రూ 2500 వరకు నొసగటానికి అధికారం యివ్వాలని ప్రభుత్వమును మహాసభ కోరింది.

పంచాయితీల యూనియన్ స్థాపితమైనప్పటినుండి కార్యదర్శిగా నుండిన శ్రీ వియన్నగారి మరణమునకు సంతాపము తెలుపుతూ ప్రారంభంలో తీర్మానం ఆమోదింపబడింది.

పంచాయితీలలో విద్యావ్యాపకానికి ప్రచారానికి ఫీర్కా, తాలూకా జిల్లా ప్రాంతీయ, రాష్ట్రీయ పంచాయితీ సంఘాలను ప్రభుత్వం అంగీకరించాలని కోరుతూ సభవారు తీర్మానం చేశారు. ...

### కార్యవర్గం ఎన్నికలు

## కేంద్రప్రభుత్వానికి అపనపుగ్రాంట్లుమంజూరు

### పార్లమెంటులో ప్రతిపాదన : ఆమోదం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 29 : పంజాబు రాష్ట్రానికిగాను 1951-52 తాలూకు చిల్లర పద్దులను దాదాపు 14 లక్షల దాకా నేడు పార్లమెంటు మంజూరు చేసింది. చర్చలో నిమిత్తంలేకుండానే ఈ వ్యవహారం నడిచిపోయింది.

అనంతరం పార్లమెంటు వారు రైల్వేలతాలూకు పద్దులను గూర్చి చర్చ ప్రారంభించారు. ఈ పద్దుల మొత్తం 8 కోట్ల రూపాయలు. ఇందులో మూడు కోట్లరూపాయలపద్దు రైల్వే ఉద్యోగుల కరువుభత్యాల పెంపకంవల్ల అయ్యే వ్యయాన్ని భరించడానికి ప్రతిపా ...

రావుబహద్దూర్ శ్రీఅన్నవరపు పుండరీకాక్షుడుగారి ధర్మనిధి.

ఇందుమూలముగా తెలియచేయునదేమనగా, 1951-వ సం॥ మార్చి నెలలో జరిగిన ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలో ఉత్తీర్ణులై కళాశాల ప్రవేశింప వర్గ అర్హులై, ఇంటర్మీడియెట్ చదువబోవు విద్యార్థులలో వ్యాయామ క్రీడలందు పోటీ పెట్టి, గెలుపొందిన మొదటి యిద్దరికిని సం॥నకు రు 144/- రు 120/- విలువగల స్కాలర్‌షిప్పు ఇవ్వబడును. కొన అప్లికేషనులు అక్టోబరు 1-వ తేదిలోగా దరఖాస్తులను పంపవలెను. దరఖాస్తు చేయు విద్యార్థులు పూర్వపు కృష్ణా జిల్లాలో నుండు ఉన్నతపాఠశాలలకు చెంది యుండవలెను.

దీనిని గురించి ఇతర విషయములను తెలియగోరువారు ఈ క్రిందివారికి వ్రాసి తెలుసుకోవచ్చును.

యస్. నాగభూషణరావు.
మేనేజింగు ట్రస్టీ, శ్రీ అన్నవరపు పుండరీకాక్షుని ధర్మనిధి, బాపట్ల.









# రేడియో

## అక్టోబరు 1 సోమవారం

### విజయవాడ

ఉ. 7-0 తెలుగున వార్తలు 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు (ఎ) వలె 8-0 ఆంగ్లమున వార్తలు.

మ 12-30 మాధ్యమిక పాఠశాలావిద్యార్థులకు. 1-0 మద్రాసు (బి) వలె 1-30 మద్రాసు (ఎ) వలె 1-40 హిందీలో వార్తలు 1-50 తెలుగున వార్తలు 2 మద్రాసు (బి) వలె 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు ఆంగ్లమున 4-0 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు.

సా. 5-30 మహేంద్రవాడ బావన్నశాస్త్రి 5-50 శ్రీకృష్ణమూర్తి శాస్త్రి వీణ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 6-30 గ్రామస్థుల కార్యక్రమం లోకయాత్ర వ్యవసాయము ప్రసంగం వడ్లారి వెంకటశివరావు నవ్యకావ్యపఠనము. రచన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7-0 తెలుగున వార్తలు 7-15 గ్రామస్థుల కార్యక్రమం వినోదవనిక రచన ఎం. రామమూర్తి 7-30 సంగీతశిక్షణ 7-45 కింతేన గాత్రం విశ్వ సాహిత్య ప్రాధాన్యము చర్చ పాల్గొనువారు పర్వతనేని వీరయ్య చౌదరి నండూరి 8 మహేంద్రవాడ బావన్న శాస్త్రి 8-30 శ్రీకృష్ణమూర్తి శాస్త్రి వీణ 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 ఆంగ్లమున ప్రసంగం 9-30 ముగింపు.

### మద్రాసు (ఎ)

ఉ. 7-0 స్వాగతము 7-30 అఖిలా శంకరన్ 8-0 ఆంగ్లమున వార్తలు.

మ. 12-30 మాధ్యమికపాఠశాల విద్యార్థులకు తమిళమున 1-0 మహిళామండలి తమిళమున 1-30 గీతమంజరి (బి) 1-40 హిందీలో వార్తలు 1-50 ఫిలిం సంగీతం (బి) 2-10 (బి) వలె 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు ఆంగ్లమున 4-0 పాశ్చాత్య సంగీతం (బి)

సా. 5-30 ఆర్. సరస్వతి 6-0 ఆంగ్లమున వార్తలు 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 కాళహస్తి వీరయ్య వీణ 7-0 ఎస్. రామ ఎన్ రాధ 7-30 ఆంగ్లమున యువజనగోష్ఠి 7-50 పీడార్ (బి) 8 (బి) వలె. 8-30 శిక్ షా. కె. వరాశసంఫెక 9-0 ఆంగ్లమునవార్తలు 9-15 హిందీపాఠము తమిళమున 9-30 (బి) వలె 10-30 ముగింపు.

### మద్రాసు (బి)

ఉ. 7-0 తెలుగున వా॥ 7-15 వి. ఎస్. రాజమయ్యంగార్ (బి) 7-30 (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు 1 గీతమాలిక (బి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 ఫిలిం సంగీతం 1-50 తెలుగున వా॥ 2 క్లారినెట్ విలయవిద్వాంసుడు 2-15 (ఎ) వలె 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు.

సా. 5-30 (ఎ) వలె 6-20 సాయం సంగీతం (బి) ఆమీర్‌ఖాన్ కర్ణాటక సంగీతం వల్లి వానబాదో 6-30 గ్రామస్థుల కార్యక్రమం లోకయాత్ర వ్యవసాయము ప్రసంగం వడ్లాది వెంకటశివరావు నవ్యకావ్యపఠనము రచన చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం వినోదవనిక రచన ఎం. రామమూర్తి 7-30 ఇంద్రసమ్మేళనము 7-45 మలయాళమున ప్రసంగం 8 సుశీలా అచ్యుతరామన్ 8.30 (ఎ) వలె 9-15 గాలివాన రూపకము ఎ. వి. వి కృష్ణారావు 9.30 ఆర్. ఎల్. కృష్ణమాచారియార్, వయొలిన్ 10 సినిమా సంగీతం (బి) వేదాంతలింగం శర్మ యశోదావలి. ప్రసన్న. నల్లతంబి. బాలరాజు, రతిరేఖ, సంగీత, రాజరాణి, బిలారీ 10-30 ముగింపు.

### హైదరాబాద్

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 తెలుగు హిందీలలో నేటి కార్యక్రమ సమీక్ష 7-20 వి. ఎస్. లక్ష్మీనారాయణ 7-50 భజన అన్వర్‌దీరాజ్ 8 ఆంగ్లమున వా॥ 8-15 గాత్రసంగీతం 8-30 భజన అన్వర్‌దీరాజ్ 8-45 గాత్రసంగీతం.

మ॥ 12-30 రాగోంకా దర్బార్ (బి) 1 మహిళా సమాజం కె. వరలక్ష్మి గానము స్త్రీలు వృద్ధులు లలితకళలు ప్రసంగం 1-30 ఆంగ్లమున వా॥ 1-40 వీణ (బి) 1-50 తెలుగున వా॥.

సా॥ 5-30 తమ్ముడమున కార్యక్రమం 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6-20 ఎన్. చిం వీణ 6-35 శ్లోకం ఉత్తరాలకు జవాబులు 6-45 గ్రామసీమ వ్యవసాయగోష్ఠి సప్లపిల్ల (బి) 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ వివిధ దేశాలలో ప్రజల ఆచారాలు టిబెట్‌దేశమ్ ప్రసంగం మయసభ పురాణ కాలక్షేపం విశేషాలు వాతావరణము 8-15 కాశ్మీర్ ఉద్యాలో ప్రసంగం 8-30 కె. వరలక్ష్మి 9 ఆంగ్లమున వా॥ 9.15 హిందీలో వా॥ 9-30 ఆఫ్‌కీవసంత్ (బి) 10-15 ముగింపు

* * *

## సెప్టెంబరు 2 మంగళవారం

### విజయవాడ

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వలె 7-30 మద్రాసు వలె 8 ఆంగ్లమున వా॥.

మ॥ 1 మద్రాసు (ఎ) వలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 4 జోహారులు (బి) ఎం. వెంకటరాజు స్వతంత్రవీరుడు లాలాంత్రపు రజనీకాంతరావు ఓ మహాత్మాజీ. మహాత్మ ప్రశంస కె. వి. దే శ్రీ గాంధీకోయీదమే దేశ్ కిహవా మే మహమ్మదరఫ్ గాంధీకివైన్ హైభారత్‌వాలో టూర్‌నజాహా జాతిరాయో కమర్ దాస్ గుప్తా మిల్‌నేవాలోరామ్ ఎం. ఎస్ సుబ్బలక్ష్మి హరితుమ్‌హారో వైష్ణవజనతో.

సా॥ 5.30 షేక్ చినమౌలాసాహెబ్ నాదస్వరం 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 గీతమంజరి (బి) ఆర్. బాలసరస్వతి జోహారు మా గాంధి టి సూర్యకుమారి ఓ మహాత్మా ఇదే జోదా 6 30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయగోష్ఠి రచన వివ్వాహిణ కె. ఎల్. నరసింహారావు విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం భజనావళి గోష్ఠిగానము 7-30 మహాత్ముడు ఆదేశించిన మానవసమాజము నన్నారాదనంబన ప్రసంగం ముదిగంటి జగన్నాథశాస్త్రి 7-45 ఎం. వి నరసరాజు 8 టి. టి. వీర 8-30 మహావాది వేంకటప్పయ్యశాస్త్రి 9 ఆంగ్లమున వా॥ 9.15 ఆంగ్లమున ప్రసంగం 9-30 ముగింపు.

### మద్రాసు (ఎ)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-30 కల్యాణ ఎస్. రామనారాయణయ్యర్ 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12-30 మహిళామండలి తమిళమున 1 మహిళామండలి భారతదేశ గేయము బాపూజీ బాల్యము ప్రసంగం జనసాజా దాల్యంకృష్ణమ్మ మీరాదేవి బాపూజీమాకుకు ప్రసంగం టి. ముకుంద 1 గీతమంజరి (బి) 1-40 హిందీలో వా॥ 1-50 ఫిలిం సంగీతం (బి) 2-10 (బి) వలె 2-15 కె. హరిహరయ్యర్ వీణ 4 ఎల్ల స్వామి వి. రామచంద్రన్ 4-30 పాశ్చాత్య సంగీతం (బి)

సా॥ 5-30 ఎం. చంద్రశేఖరన్ వయొలిన్ 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-15 గోటువాద్యము విందువిద్వాంసుడు 6-20 ఎస్. రామనాథన్ 7 జాతీయ దామ్ (బి) మీరాభజన్ 7-30 తమిళమున ప్రసంగం 7.45 మదురై మణి అయ్యర్ తిరుచి నుండి 9 ఆంగ్లమున వా॥ 9 15 హిందీపాఠము 9-30 కె. వి. మండరావాలాల్ 10-30 ముగింపు

### మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 ఉదయరాగము (బి) 7.30 (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12.30 చంద్రానందన్ 1 గీతమాలిక (బి) అపూర్వ సహోదరులు, శ్రీలక్ష్మమ్మకథ. చంద్రలేఖ, బాలన్. కె భానుమాన్ 1-30 ఆంగ్లమున వా॥ 1-40 ఫిలిం సంగీతం (బి) నవజీవనం బామిడు వర్ భక్తసూరదాస్ 1-50 తెలుగున వా॥ 2 వేణువు విలయవిద్వాంసుడు 2-15 (ఎ) వలె 4 (ఎ) వలె.

సా॥ 5-30 (ఎ) వలె 6-15 సాయం సంగీతం (బి) నీలమ్మాళ్ బాలసరస్వతి మాలారాణి 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయగోష్ఠి రచన నిర్వహణ కె. ఎల్. నరసింహారావు గాంధీ ప్రశంస విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం భజనావళి గోష్ఠిగానము 7-30 మహాత్ముడు గ్రామ జీవితము ప్రసంగం ఐలుసు సాంబమూర్తి 7.45 (ఎ) వలె 9-15 తమిళమున సంగీత రూపకము 9.30 (ఎ) వలె 10-30 ముగింపు.

### హైదరాబాద్

ఉ॥ తెలుగున వా॥ 7-15 తెలుగు హిందీలలో నేటి కార్యక్రమ సమీక్ష 7-20 రఘుపతిరాఘవ భజన్ 7.25 వివేదన గీతాలు 7-40 ఆర్. స్వామినాథన్ 7.55 నాదస్వరం (బి) 8 ఆంగ్లమున వా॥ 8-15 హిందీపాఠము 8.30 శాస్త్రీయ సంగీతం కృష్ణరావ్‌శంకర్ పండిట్.

మ॥ 12-30 కృష్ణరావుశంకర్ పండిట్ శాస్త్రీయ సంగీతం 1 వాద్యసంగీత్ (బి) 1-10 కదంబం (బి) 1-30 ఆంగ్లమున వా॥ 1.40 సురమాలిక (బి) 1-50 తెలుగున వా॥.

సా॥ 5-30 మహాలక్ష్మియున కార్యక్రమం 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6-20 గాంధీ జయంతి 6-45 గ్రామసీమ వద్యాం జలి మెహబూబ్ అలీ పాముర్తి గాంధీ ఉపాధ్యాయ గాంధీజీ సూక్తులు 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ శేఖోమార్గము రూపకము విశేషాలు మార్కెటు ధరలు వాతావరణము 8.15 గాంధీజీ ప్రసంగం 8.30 కృష్ణరావ్‌శంకర్ పండిట్ 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 గాంధీ జయంతి సత్యశోధనయతి నాటిక రచన ఎన్. కేశవస్వామి వైష్ణవజనతో భలన్ 10 ఆర్. స్వామినాథన్ 10.15 ముగింపు.

# క్రీడా రంగం

## నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్పు

బొంబాయి, సెప్టెంబరు 28 : నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్పు సెమీఫైనల్సునందు నేడు బెంగాలు జట్టు హైదరాబాదు జట్టును ఒకగోలుచేసి ఓడించింది. ఇప్పుడు బెంగాలు జట్టు వరు బొంబాయి జట్టునకు ఆదివారం ఫైనలు ఆట జరుగుతుంది.

## మద్రాసు టేబుల్ టెన్నిస్

మద్రాసు, సెప్టెంబరు 29 : సుకృత లక్ష్మీవిలాస సభ టేబుల్ టెన్నిస్ టూర్నమెంటునందు నిన్న సాయంకాలం జరిగిన ఆటలఫలితాలిట్లున్నవి: పురుషులు సింగిల్సు : యస్. రామనాథన్, మిత్రా రాజమాణిక్యంను; జి. రాజేంద్రసింగ్, బి. శ్రీనివాస్‌ను; జె. వి. యస్. రావు, టి. ఆర్. శ్రీనివాసన్‌ను; పి. కె. పార్థసారథి, టి. ఎస్. పాండురంగంను; వి. శివరామన్, ఇ. పద్మనాభన్‌ను; పి. ఎం. కృష్ణన్, వి. ఎస్. సుబ్రహ్మణ్యంను; టి. జి. తిరుమలస్వామి, సి. రంగనాథన్‌ను; జి. రాజేంద్రసింగ్, ఇ. బాలచందర్‌ను; ఎ. ఎస్. పి. సారథి, వి. శ్రీరామమూర్తిని; బి. నరసింహన్, ఎల్. ఎస్. హీరమన్‌లాల్‌ను; జె. వి. ఎస్. రావు, జి. రాజేంద్రసింగ్‌ను; ఎం. ఎస్. పి. సారథి, ఇ. కోదండపాణిని ఓడించారు. డబుల్సు : వి. శివరామన్, ఎం. ఎస్. రామన్‌లు ఎం. కృష్ణన్, ఎం. ఆంద్రూస్‌లను; బి. శ్రీనివాస్, కె. రామన్‌లు కె. నరసింహన్, ఎ. షణ్ముగంలను ఓడించారు.

## మద్రాసు హాకీ లీగ్

మద్రాసు హాకీ లీగ్‌నందు శుక్రవారం సాయంకాలం సదరన్ రైల్వే జట్టు, టెలిగ్రాఫ్ రిక్రియేషన్ క్లబ్బు జట్టును 3-0 గోలులతో ఓడించింది.

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 29.

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎద్దప్పతొమ్ము పేట్సుటాకృష్ణులోనహా రు. 77.4.0 సెటిల్మెంటుగారు తులం 111.0.0 మూన బంగారు 108.4.0 సీమవెండి తులం 100-కి (రెడీ) 190.0.0 వెండి తులం 1-కి 1.15.6.

వేరుశెనగ : (531 పౌ 1-కి ఎద్దుకోస్తా గిడ్డంగులు మిషన్ -పేట్సుటాకృష్ణులో వహా)

| | |
|---|---|
| వరాని | రు. 183 |
| కడప | రు. 187 |

వేరుశనగనూనె ఎద్దుపెట్టర్ టిన్ 3% నాటుకర్ (500 పౌ.) రు. 360 363
ఉంకాయ మాసె (37½ పౌనుల గం. ధరల)
ఒకటి- ఎ బ్రాండ్

| | |
|---|---|
| క్వాలిటీ | రు 40.0.9 |
| యస్. బ్రాండ్ | 40.4-9 |

### ఆముదం

500 పౌనుల గం ధరల ఒకటి

| | |
|---|---|
| "తిరువత్తూర్" | రు. 410.0.0 |
| నరసారావుపేట" | రు. 420. 0-0 |

### పంచదార

| | |
|---|---|
| పుగలూర్ | రు. 103-4-8 |
| హాస్పేట | రు. 103-14-5 |

## బొంబాయి వెండి బంగారు మార్కెట్

బొంబాయి, సెప్టెం 29: నేటిమధ్యాహ్నం 2-15 గం॥లకు బొంబాయి వెండి-బంగారు మార్కెటుధరలు: వెండి (100 తు) రు 188-0-0, బంగారం (తు 1కి) రు. 109-1-0, సావరిన్ 1 కి రు 76-8-0.

## హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్)

(వర్తకులు గుమ్మా బాల్కయ్యగారి వెంకటేశం)

హైదరాబాదు, సెప్టెంబరు 29 : బంగారం తులం1కి 128-8-0, వెండి 100 తు 214.8.0.

వర్లా ఒకటి వసుపు 45-70 పెసలు 43-14.0-44 కందులు 46 48.0-0 మినుములు 64.12.0-66-12-0 వంకలు 52-52-9-0 ఉలవలు 42.46 కందిపప్పు పెద్ద 66-66-4 0 కందిపప్పు చిన్న 61-62-4.0 పెసరపప్పు 63 63 4.0 మినపప్పు 97. 110 వేరుశనగపప్పు 91 99 ఆముదాలు 91. 0 0, 92 వింతమందు 35-35 మిర్చి 120 150 ఇసుము 51 54 జొన్నలు 16 రేరు మక్కలు 20-21 బియ్యం 11.13 ...

# రాష్ట్రవార్తలు

## విజయవాడ

అక్టోబర్ నెలాఖరున ఇక్కడ జరగబోతున్న రాష్ట్రసంఘ సేవకుల మహాసభ సహాయార్థం యీ 25 వ తేదీ రాత్రి విజయవాడ జాతీయనాట్య సమితివారు తిరుపతి వెంకటకవుల పాండవోద్యోగ విజయాలను ప్రదర్శించారు. శ్రీయుతులు జొన్నలగడ్డ సీతారామశాస్త్రి, పులిపాటి లక్ష్మీనారాయణ, యం. భీమారావు, వి. శ్రీధరరావు, బి. వి. రంగారావు, వెంట్రప్రగడ నారాయణరావు, పాండూరి వెంకటేశ్వరరావు, కుందేరు కృష్ణశర్మ, అన్నాప్రగడ లక్ష్మీకాంతరావు, సూర్యరత్నకుమారి వగైరాలు నటించారు. ఈ సందర్భంలో మహాసభోద్దేశ్యాలను శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డి, యార్లగడ్డ శివరామప్రసాద్, యస్. వి. యస్. ప్రసాద్ వివరించి, నటులకు తమ కృతజ్ఞత తెల్పారు. (స్వ. వి.)

కాళేశ్వరరావు మార్కెటులో శ్రీ సత్యనారాయణస్వామి కూరగాయల చిల్లరవర్తక సంఘమువారు, మునిసిపల్ కౌన్సిలరు ఎం. ఎ. రహమాన్ సాహెబు, సంఘ సభ్యుడైన కటకం బ్రహ్మయగార్ల మృతికి సంతాపసూచకంగా యీ 26 న మార్కెటు మూసివేశారు.

## తెనాలి

మురుకొండపాడుగ్రామ భూములను మంజూరు పొందిన రాజకీయ బాధితులు యిటీవల యిక్కడ శిష్టా సాక్షి సోమయాజులుగారి అధ్యక్షతను సమావేశమై, తమ సంఘాధ్యక్షుడుగా రామినేని నారాయణ, కార్యదర్శులుగా పొన్నపల్లి సూర్యప్రకాశరావు కొంగర జగ్గారావు, కోశాధికారిగా ముప్పాలనేని మాణిక్యాలరావుగార్లను కార్యవర్గ సభ్యులుగా మరి ఏడుగురిని ఎన్నుకొన్నారు. తమ సంఘ కార్యాలయాన్ని బాపట్లలో నెలకొల్ప నిశ్చయించుకొన్నారు.

## ఏలూరు

ఆంధ్ర వైద్యమండలి స్థాయిసమితి సభ్యులు యీ 22 న అంజుమాన్ గ్రంథాలయంలో అగ్నిహోత్రం విజయసారథి ఆచార్యగారి అధ్యక్షతను సమావేశమై 25 వ వైద్య సమ్మేళనము, రజతోత్సవాలను డిసెంబరులో బందరులో జరుపాలని నిశ్చయించుకొన్నారు. సమావేశ అధ్యక్షుడుగా వస్తాదు వెంకటస్వామిగారిని ఎన్నుకొన్నారు. సత్వర ఆంధ్రరాష్ట్ర స్థాపనను అర్థిస్తూ ఒక తీర్మానమూ, శ్రీమతి అచంట రుక్మిణీలక్ష్మీపతిగారిమృతికిసంతాపం ప్రకటిస్తూ మరొక తీర్మానమూ చేశారు.

శాంతిసమితి సహాయార్థం యిక్కడ యీ 16 న కళాకేంద్రంవారు 'మేడిపట్లు' అనే నాటకాన్ని ప్రదర్శించారు. మొత్తం రు. 750/-వసూలైంది. టిక్కెట్లపై శాంతి సందేశం ముద్రించి యింటింట శాంతి ప్రచారం చేశారు.

బిసెంటు వర్ధంత్యుత్సవాలు స్థానిక గుప్త విద్యాలాభి అధ్వర్యాన యీ 20 వ తేదీనుండి జరపబడుతున్నాయి. శ్రీ గుంటూరు వెంకటసుబ్బారావు, కాకరపర్తి సత్యనారాయణ, నండూరు రామకృష్ణరావు, ఐ. వి. చలపతిరావు, శ్రీమతి బులుసు ప్రకాశమ్మ, వేమూరు శ్రీనివాసరావు, వల్లూరి బలరామకృష్ణగార్లు బిసెంటు జీవితాన్ని గురించి ఉపన్యసించారు. చి॥ గండికోట సూర్యప్రభ భరతనాట్య ప్రదర్శనం జరిగింది. (స్వ. వి.)

## నర్సారావుపేట

అఖిల భారత స్వయంసేవక సంఘ నాయకుడు భాయీ మహావీర్ గారు యిక్కడకు యీ 28న వచ్చారు. హిందూ ఐకమత్యమును గూర్చి వారు యింగ్లీషులో చెప్పిన ఉపన్యాసాన్ని కె. దత్తాత్రేయులు గారు తెలుగు చేశారు.

## భీమవరం

ఈ తాలూకాలోని కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ సానుభూతి పరులు యీ 20న యిక్కడ సమావేశమై 90 మంది సభ్యులతో తాలూకా సంఘాన్ని 15 మంది సభ్యులతో తాలూకా సంఘ కార్యవర్గాన్ని స్థాపించారు. కార్యదర్శులుగా చెరుకువాడ వెంకటసుబ్బారావు, గణపతి శ్రీరాములు, ఎరకరాజు సత్యనారాయణగార్లు ఎన్నికైనారు. నిధిసేకరణకు భూపతిరాజు సుబ్బరాజు, గాదిరాజు జగన్నాథరాజు, గొట్టుముక్కల రామచంద్రరాజు, బండారు జగపతిరావు గార్లతో ఒక సంఘాన్ని ఏర్పాటు చేశారు. ప్రచారకమిటీ సభ్యులుగా చెరుకువాడ వెంకటరమణమూర్తి, మెల్లా సూర్యనారాయణ, షేక్ అలీ, గాదిరాజు విశ్వనాథరాజు, కామంచిపూడి కాల సూర్యనారాయణ రాజు, పెండ్యాల అనసూయాదేవి గార్లను ఎన్నుకొన్నారు.

## నిడదవోలు

సహకార అర్బన్ బ్యాంకు సర్వసభ్య సమావేశం యిటీవల కందుకూరి సుబ్బారావుగారి అధ్యక్షతను జరిగింది. ఆడిట్ రిపోర్టు, బడ్జెట్లను ఆమోదించిన మీదట డైరెక్టర్ల ఎన్నిక జరిగింది. అధ్యక్షులుగా కందుకూరి సుబ్బారావు, కార్యదర్శులుగా షేక్ మీరా మొహిద్దీన్, గ్రంథమూరరాజు, డైరెక్టర్లుగా పుచ్చల వెంకన్న, అద్దాల సుబ్బారావు, మండపల్లి అప్పారావు, కందుకూరి రామారావు, కొప్పరపు ప్రసాద్, గంటామూర్తివరావు, గార్లు ఎన్నికైనారు.

## జగ్గయ్యపేట

ఈ 19 న గాంధీ చౌకులో అమరవారి మహాదేవశాస్త్రిగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో స్వామి సీతారాంగారి ఆంధ్రరాష్ట్ర స్థాపనోద్యమాన్ని బలపరుస్తూ తీర్మానంచేశారు. పులిచింతల ప్రాజెక్టు విషయంలో మంత్రి భక్తవత్సలంగారి ధోరణిని సభవారు నిరసించారు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసువారు నెల్లూరు సమావేశంలో చేసిన తీర్మానాన్ని కూడా నిరసించారు. ఆంధ్రరాష్ట్ర వాంఛను పులిచింతల ప్రాజెక్టు విషయాన్ని నివేదించటానికి స్థానికాధికారి డిప్యూటీ తహశీల్దారు వద్దకు రాయబారం పంపాలని నిశ్చయించుకొన్నారు. గాయక ప్రముఖుడు పిరాట్ల శంకరశాస్త్రిగారి మృతికి సంతాప తీర్మానం చేశారు. పెద్దాపురపు వెంకటనారాయణ ప్రభృతులు ప్రసంగించారు.

## ఆకివీడు

ఆంధ్రరాష్ట్ర జాతీయ కాంగ్రెసు నాయకులు తమ జిల్లా పర్యటన సందర్భంలో యిక్కడకు యీ 16 న వచ్చారు. వరదా సుబ్బారావుగారి అధ్యక్షతను జరిగిన బహిరంగ సభలో గుడిమెట్ల గంగరాజుగారు జాతీయ చేతి కాంగ్రెసు సంఘాశయాలను వివరించి, ప్రతి చేనేత పారిశ్రామికుని యీ సంస్థలో చేరమని కోరారు. అల్లం మాణిక్యం, చల్లా గణపతిగార్లు కూడా ప్రసంగించారు. నాజరు దళంవారు పల్నాటి కథ బుర్రకథగా చెప్పారు.

## విజయనగరం

ఈ తాలూకా హరిజన కార్యకర్తలు సేవకులు యీ 16 న ఎ. వి. ఆర్. మూర్తిగారి అధ్యక్షతను సమావేశమై యీ నియోజకవర్గంలో పోటీ చేయదగ్గ హరిజన అభ్యర్థి నిర్ణయాన్ని గూర్చి చర్చలు జరిపారు. కాంగ్రెసునే బలపరచ నిశ్చయించారు. అనాదిగా కాంగ్రెసులో వున్నవారినే అభ్యర్థిగా ఎన్నుకోమని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసువారిని కోరారు.

## చిత్తూరు

హిందూమహాసభవారి యీ జనవాన్యాన యిటీవల యిక్కడ జరిగిన బహిరంగసభలో డా॥ పురుషోత్తంగారు కాంగ్రెసు పరిపాలనను విమర్శించారు. రాబోయే ఎన్నికలలో తమ పార్టీనే బలపరచుమని ప్రజలను కోరుతూ పలువురు ప్రసంగాలు చేశారు.

కణ్ణన్ అనే బాలుని స్మారకచిహ్నంగా ఏర్పడి, 4 ఏండ్లుగా పనిచేస్తున్న హైస్కూలుకు ఎన్. పి. చంగల్రాయనాయుడుగారి అధ్యక్షతను యిటీవల వార్షికోత్సవం జరిగింది. కణ్ణన్ జన్మదిన సందర్భంలో రెండురోజులు ఆటపాటలు నాటక వక్తృత్వపోటీలు జరిగాయి. హెడ్మాస్టరుగారు నివేదిక సమర్పించారు. జిల్లా విద్యాశాఖాధికారి పతి బహుమతులు పంచిపెట్టారు.

## తిరుపతి

లలితకళా సమితివారు యీ 16 న యిక్కడ ఆచార్య ఆత్రేయగారు రచించిన "ఎవరు దొంగ" అనే నాటకాన్ని ప్రదర్శించారు.

తిరుపతి ఫోరమ్‌వారు "ప్రపంచ శాంతికి అమెరికా విధానం భంగకారి" అనే అంశంపై చర్చలు జరిపారు. షుక్కూర్, టి. ఇ. వీరరాఘవన్, ఎం. కృష్ణస్వామి, బి. వి. రామానుజం, ఎన్. శ్రీనివాసులు, ఎం. బలరామిరెడ్డి ప్రభృతులు యిందు పాల్గొన్నారు. పై ప్రతిపాదనకు అనుకూలంగా అధిక సంఖ్యాకులు ఓటు చేశారు.

## కార్వేటినగరం

కార్వేటి నగర రాజావారి అధ్యక్షతను యీ 18 న సారస్వత సంఘసమావేశం జరిగింది. టి. ఆర్. సుందరేశంగారు స్వాగతోపన్యాసమిచ్చారు. పుత్తూరు బోర్డ్ పాఠశాలల యిన్‌స్పెక్టరు వెంకట్రాయశాస్త్రిగారు సారస్వత సేవలో విద్యార్థుల కర్తవ్యాన్ని గూర్చి ఉపన్యసించారు. టి. శ్రీనివాసరావు పంతులుగారి వందనాలతో సభ ముగిసింది.

## కర్నూలు

నందికొట్కూరు తాలూకా వెనుకబడిన జాతుల సంఘం యాజమాన్యాన ముచ్చుమర్రి గ్రామంలో యీ 17న లక్ష్మీపురం లేవన్నగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగింది. పార్లమెంటు సభ్యుడు డి. సంజీవయ్యగారు సభను ప్రారంభించారు. జిల్లా వెనుకబడిన జాతుల సంఘాధ్యక్షుడు బాగాపురం శంకరయ్యగారు మాట్లాడుతూ గ్రామగ్రామాల వెనుకబడ్డ జాతుల సంఘాలు ఏర్పడాలన్నారు.

## ప్రొద్దుటూరు

శ్రీ కృష్ణగీతా ఆశ్రమంలో ఆరంభమయిన ఆంధ్రసర్వోదయ మహాయజ్ఞాన్ని స్వామి సీతారాంగారి ఆదేశానుసారము యీ 21న ముగించారు. స్వామీజీ ప్రభృతుల ఆరోగ్యాభివృద్ధికి ఆశయసిద్ధికి బింగా వెంకటసుబ్బయ్య, చిడిపాటి నరసారెడ్డిగార్లు ప్రార్థనలు జరిపారు.

ఇక్కడపద్మశాలీలకు నేతపనివారి సంఘం ఒకటి యిటీవల స్థాపితమైంది. ఈ సంఘానికి అధ్యక్షుడుగా వి. శ్రీనివాసరావు, సంయుక్త కార్యదర్శులుగా కె. వెంకటరామానాయుడు, ఓ. భీమారావుగార్లు ఎన్నికైనారు. ప్రస్తుతపు స్థితిలో వున్న నేతపని పరిస్థితి, పరిశ్రమ, మరింత పారుదల మొదలైనవాటిని పలువురు విమర్శిస్తూ ప్రసంగాలుచేశారు.

## ప్రకటన

రేపు 30 వ తేదీ ఆదివారం మహాలయ అమావాస్య యగు మా కార్యాలయమునకు వు. కావున అక్టోబరు 1-వ గల పత్రిక వెలువడదు.

మేనేజరు.

## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద బ॥ చతుర్దశి
1951 సం॥ సెప్టెంబరు 30 ఆదివారం
చతుర్దశి ప 7-54 ఉ.ఫ రా 12-23
వర్జ్యం ఉ 7-20 ల 8-57 కు.
బ॥అమావాస్య అక్టోబరు 1 సోమవారం
సో॥అమా॥ ఉ 7-24 హస్త రా 12-12
వర్జ్యం ప 8-43 ల 10-18 కు.


# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్ (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద బ॥ చతుర్దశి
ఆదివారం


## పంచాయతీ ప్రభుత్వం

గ్రామపంచాయతీ సహకార మాల్లో మన రాష్ట్రం, లోని ఇతర రాష్ట్రాలన్నిటి కీ ఎంతో అభివృద్ధి ధించినది మధ్య, ఉత్తర దేశ్ రాష్ట్రాల్లో ఈమధ్యనే గ్రామపంచాయతీలను ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు ప్రారంభమైనవి మధ్యప్రదేశ్ లోని జానపద సభలు ప్రశంసనీయంగా పనిచేస్తున్నవి వెను, అంటే 1950 సంవత్సరం చాయతీ శాసనం రావ నికి ముందు, మనరాష్ట్రం ని గ్రామ పంచాయతీలకు న్న అధికారాలకంటే ఈ పదసభలకు ఎక్కువ అధి లు ఇవ్వబడినవి ధనాభా వల్ల ఈ జానపదసభలు యుకలిగినంత పనిచేయు లేక వుచున్నవి

దనుకనే మొన్న, నిన్న నగ రంలో సమావేశమైన పంచాయతీల అధ్యక్షులు 1950 శాసనాన్ని అనుసరించి పంచాయతీలు తమ బాధ్యతలను నిర్వహించాలంటే, వాటి ఆదాయ స్థితిని అభివృద్ధి చేయవలసి వుంటుందని సూచించారు మహాసభను ప్రారంభించి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కుమారస్వామి రాజాగారు ఈ సమావేశ తీర్మానాలను ప్రభుత్వం అత్యంత సానుభూతితో, శ్రద్ధగా పరిశీలించగలదని అభయం ఇచ్చారు ఆహ్వానసంఘ అధ్యక్షుడు శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు పంచాయతీలవిధులను వివరిస్తూ అట్టి విధి నిర్వహణకు ప్రభుత్వం కల్పించవలసిన ప్రత్యేక వసతులను ముఖ్యమంత్రికి విన్నవించారు. పంచాయతీలు సమర్థతతో పనిచేస్తే జిల్లాబోర్డులు అనవసరమై పోగలవన్నారు. కాని తాలూకా, జిల్లా, రాష్ట్ర పంచాయతీల సంఘాలను ప్రభుత్వం శాసనరీత్యా ఏర్పాటు చేయాలని సూచించారు. అట్టివి జిల్లా బోర్డులు రద్దయ్యేపక్షంలో అనవసరమే కావచ్చును. కాని 1950 శాసనం ఎలా పనిచేస్తుందో, పంచాయతీలు తమ నూతన బాధ్యతలను ఎలానిర్వహిస్తవో చూచినమీదట గాని ప్రభుత్వం వీన్నిగురించి ఒక నిర్ణయానికి రాలేదు. తాలూకా, జిల్లా సంఘాలను స్థాపించకుండా జిల్లాబోర్డులను రద్దుచేయడం కూడా సాధ్యం గాదు. జిల్లాబోర్డుల పునర్నిర్మాణంగురించి విచారించుటకు ప్రభుత్వంవారు ఏర్పాటు చేసిన కమిటీ సిఫార్సులను కూడా పరిశీలించవలసి వుంటుంది.

ఇవన్నీ నిదానంమీద జరుగవలసిన పనులు. మనస్థానిక స్వపరిపాలనా మంత్రి పంచాయతీ రాజ్యస్థాపన విషయంలో ప్రత్యేకశ్రద్ధ కలిగి ఉన్నారు. గ్రామాభ్యుదయానికి తోడ్పడేటట్లు గ్రామపంచాయతీలను పునర్నిర్మించడానికి అవసరమైన చర్యలను తీసుకోవడానికి వారు సంకోచించరు. వారికి చేయూత నివ్వవలసిన బాధ్యత పంచాయతీబోర్డుల అధ్యక్షులపైన ఉంది. ఇన్ని దండయాత్రలు జరిగినా, ఎన్నో యుద్ధాలు జరిగినా భారతీయ సంస్కృతి, సంఘజీవనం ఈ మాత్రంగా నైనా నిలబడి ఉందంటే, అది మనపంచాయతీ పద్ధతివల్లనే అని అందరూ అంగీకరించారు. దీనినిబట్టి మన పంచాయతీల సంప్రదాయం ఎలాంటిదో, అవి నిర్వహించవలసిన పనులు ఎలాంటివో స్పష్టమౌతున్నది. ఎన్నికలు పూర్తికాగానే 1950 శాసనం ప్రకారం పంచాయతీల స్థాపనకు ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకుంటుంది. ఈలోపున రాష్ట్రంలోని పంచాయతీబోర్డుల అధ్యక్షులందరూ అనుభవజ్ఞుడైన శ్రీ రామలింగం చెట్టియార్ గారి అధ్యక్షతను సమావేశమై ఈ శాసనమును చర్చించి, తమ కర్తవ్యమును విచారించుకొని, ముందు కార్యక్రమమును నిర్ణయించుకొనుట శుభసూచకము. ఇట్టి సమావేశమును ఏర్పాటుచేసి పంచాయతీ ప్రభుత్వవిధానము జయప్రదమగుటకు కృషిచేస్తున్న శ్రీ నరసింహదేవర సత్యనారాయణ ప్రభృతులు అభినందనీయులు.

## బ్రిటిష్ కన్సర్వేటివ్ పార్టీ ఎన్నికల ప్రణాళిక

### పునరాయుధధారణకార్యక్రమం కొనసాగించడానికి నిర్ణయం

లండన్, సెప్టెంబరు 28: బ్రిటిష్ కన్సర్వేటివ్ పార్టీ ఈ రోజున తన ఎన్నికల ప్రణాళిక ప్రచురించినది. రాబోయే ఎన్నికలలో నెగ్గినట్లయితే బ్రిటన్ తిరిగి ప్రపంచ నాయకత్వం వహించేటట్లు చేయడానికి, బ్రిటన్‌ను ఆర్థికంగా పునరుద్ధరించడానికి కృషి చేయగలమని కన్సర్వేటివ్ పార్టీ ప్రకటించినది.

ఎన్నికల ప్రణాళిక విడుదలచేస్తూ, కన్సర్వేటివ్ పార్టీ నాయకుడు విన్‌స్టన్ చర్చిల్ ఇలా ప్రకటించారు. "రష్యా ప్రపంచదేశాలతో మైత్రి నెరపేకాలం వచ్చేఅవకాశాలున్నవి. ఆకాలంలో ప్రపంచ ప్రజలపరిస్థితులు మున్నెన్నడూ ఎవరూ ఊహించలేనంత ఎక్కువగా అభివృద్ధి చెందగలవు."

కన్సర్వేటివ్ పార్టీ కార్యక్రమంలోని ప్రధానమైన విషయాలు ఇవి:- (1) కార్మికపక్ష ప్రభుత్వం ప్రారంభించిన పునరాయుధధారణ కార్యక్రమాన్ని కొనసాగించడము. పునరాయుధధారణ కార్యక్రమానికి అయ్యే 470 కోట్ల పౌండ్ల ఖర్చులో సాధ్యమైనంత ఎక్కువ ప్రయోజనం పొందడానికి ప్రయత్నించడము. (2) ఇనుము, ఉక్కు పరిశ్రమలను జాతీయపరంచేసేచట్టాలను రద్దుచేయడము. ఇకముందు ఇతర పరిశ్రమలను జాతీయపరం చేసే ప్రయత్నాలు విరమించడము. (3) ప్రభుత్వ యాజమాన్యం క్రింద ఉన్న రైల్వే, రోడ్ ట్రాన్స్‌పోర్ట్ సర్వీసులను ప్రాంతీయ ప్రాతిపదికపై పునర్నిర్మించడము. (4) బొగ్గు పరిశ్రమను ప్రభుత్వ యాజమాన్యం క్రిందనే ఉంచడము (5) లాభాలపై ప్రస్తుతమున్న పన్నులపద్ధతిని మార్పుచేయడము. లాభాలతో కొత్త యంత్రాలు నెలకొల్పడానికి పూనుకునే సంస్థలకు సహాయం చేయడము. (6) సంస్థల నిర్వహణను క్రమబద్ధం చేయడము.

---

బెంగళూరు, సెప్టెంబరు 28. సంస్థానంలోని నిరుద్యోగాన్ని తగ్గించే ఉద్దేశ్యంతో మైసూరు ప్రభుత్వంవారు కార్మికమంత్రి శ్రీ కె. టి. భాష్యంగారి అధ్యక్షతను ఒక సలహా సంఘాన్ని ఏర్పాటు చేశారు. కార్మికులు, నిర్వాహకులు, ప్రభుత్వము, శాసనసభ, స్థానిక సంస్థలు — వీటన్నిటి ప్రతినిధులు అందులో ఉన్నారు. వీరు ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిల వారికి సలహా సహాయాలిస్తూ వుంటారు.

## మౌంట్ బాటెన్ దౌత్యం....(8)

# మౌంట్‌బాటెన్‌పై జఫ్రుల్లా ఖాన్ అభాండాలు

## వాటి ప్రతిక్రియలకు ఆలోచన

### సమితిలో కాశ్మీర్ చర్చలు

ఇండియా పాకిస్తాన్ల ప్రధానులు తరుచు సమావేశమవుతూ వుండడానికి లార్డ్ మౌంట్‌బాటెన్ చేసిన ఆలోచనలనూ, కాశ్మీర్ సమస్యపై సమితి జరిపిన చర్చలలో మౌంట్‌బాటెన్‌పై పాకిస్తాన్ ప్రతినిధి జఫ్రుల్లా ఖాన్ చేసిన ఆరోపణలను, వాటికి ఆయన నిర్ణయించనున్న ప్రతిక్రియలను ఈ వ్యాసంలో రచయిత అలాన్ కాంప్‌బెల్ జాన్సన్ పొందుపరిచారు.

కాశ్మీర్ సమస్యపై లేక్‌సక్సెస్‌లో సమితి జరుపుతున్న చర్చల తరంగంలో ఏదో పెద్ద లోపం వుండితీరాలని వ్యాసకర్త అభిప్రాయపడుతున్నారు.

ప్రభుత్వ భవనం: కలకత్తా.
సోమవారం మార్చి 8,1948

ఉపన్యాసాలు అయిపోయినాయి. అతిథులంతా వెళ్లిపోయారు. సి. ఆర్. నా దగ్గరకు వచ్చారు. ఆయన ఏది మాట్లాడినా మత మంతునిలాగా మాట్లాడతారు. ఆ మాటల్లో మొగమాటం అంటూ కూడా వుండదు. అట్లా ఇప్పుడు కూడా నాతో మాట్లాడారు. ఆమాటలు ఇవి: "కాశ్మీర్ వ్యవహారం నన్ను బాగా వేధిస్తున్నది. దేశం ఆదాయం అంతా దీనినిగూర్చి వ్యయం అయిపోతున్నది. ఈ విందులో ఇన్ని కప్పులు వున్నాయి. విందుకు ఇంత మంది అతిథులు వచ్చారు. ఆ కప్పులు పగిలిపోయినాయి. అతిథుల సంగతి అంటూ మరిచిపోయి, ఆ కప్పులను బాగు చేయించడానికి పూనుకుంటున్నట్లుగావుంది నాకు ఈ కాశ్మీర్ వ్యవహారం అంతా. ఇక దీనికి ఇంపుగాని, సలహాలు అంటూ ఇవ్వడం లార్డ్ మౌంట్ బాటెన్ సంతోషించు కోగలరనుకుంటాను. స్నేహితుడా! ఆయనకు అట్టి సలహాలను వినే శక్తి ఎంతైనా వుంది." సి. ఆర్. అన్న ఈ మాటలు విని, మౌంట్ బాటెన్ ఇప్పుడు నిర్వహిస్తున్న హోదా ఒక సలహాదారుని హోదాయే గనుక, తన మాట చెల్లకపోగా, తాడు తెగేటంతదూరం ఎన్నడూ పోడని నేను సమాధానం ఇచ్చాను.

### నెహ్రూ-లియాఖత్ సమావేశం

గవర్నమెంటు హౌస్: న్యూఢిల్లీ
శుక్రవారం మార్చి 19,1948.

మళ్లీ ఢిల్లీలో మాకు చేతినిండా పని దొరికింది. రెండు నెలల అనంతరం తిరిగి నేడు నెహ్రూ-లియాఖత్ సమావేశం జరిగింది. సమిష్టి రక్షణసంఘం ఆధ్వర్యంలో వీరిద్దరిని ఇట్లా సమావేశపరచడం మౌంట్ బాటెన్‌కు ఎంతో కష్టం మీదగాని సాధ్యం కాలేదు. ఏప్రిల్ 1 నాటికి ఇది ఎట్లాగూ రద్దయిపోతుంది. అయినా అట్లా కాకుండా చూద్దామన్న ఒకభావం, క్రమేపీ ఈ సంఘం విధులను పెంచుదామన్న ఒక ఉద్దేశం, రెండు రాజ్యాలకు సంబంధించిన ఆర్థిక విషయాలను, విదేశాంగ వ్యవహారాలను, రవాణా సౌకర్యాలను దీని ఆధీనంగా కొనసాగింపబడేటట్లు చూడాలన్న ఒక ఆశయం ఆయనలో మెదులుతూ వుంది. (తాను ఉద్యోగంలో వున్నంత వరకూ తాను ఈ సమావేశాలకు అధ్యక్షత వహిస్తూవుంటాడు. ఆ తర్వాత, ఏ దేశంలో ఇది సమావేశం అయితే, ఆ దేశంప్రధాని అధ్యక్షత వహించాలని ఏర్పాటు చేయవచ్చు) అయితే. ఈ రకమైనభావం అటు పాకిస్తాన్‌కు గాని, ఇటు ఇండియాకుగాని రుచించలేదు. కాని, ఈ రెండు అధినివేశాల ప్రధానులు కలుసుకుంటూ వుండడానికి, మాట్లాడుకుంటూ వుండడానికి ఇది ఒక ఉపాయంగా బాగా వే పున్నదనిమాత్రం గ్రహించారు. అంతే, ఇక వారు ప్రతినెలా కలుసుకొని, సమిష్టి వ్యవహారాలనుగూర్చి, ఇట్టి ఉపాయం ద్వారా ఎందుకు చర్చించుకో కూడదని వాదించి, తన వాదనను వారిచేత అంగీకరింప జేయడానికి మౌంట్ బాటెన్‌కు ఎంతో సేపు పట్టలేదు.

ఆరునెలల వైరుధ్యాన్ని, ఆరునెలల విస్ఫోటనాన్ని అవతలకు నెట్టి నెహ్రూ, లియాఖత్‌లు ఇద్దరూకూడా, ఎంతో ఉదారంగా సుమనః పరీపాకాన్ని అవలంబించి చర్చలకు దిగారు. ఈ ఇద్దరికి అన్ని వ్యవహారాలను వదిలివేసి, వారిమీద ఒత్తిడులు, ఒత్తిడులు లేకుండా చూస్తే కొంగుపడని సమస్యలన్నీ ఇట్టే తేలిపోయి, ముద్రలుపడి, అందరికి శిరోధార్యాలుగా ప్రకాశిస్తాయని, వారి ఈ సమాలోచనలను చూచిన ఎవరికైనా అనిపిస్తుంది.

ఇవాళ్టి జరిగిన ఈ సమాలోచనలలో అన్ని సమస్యలను గూర్చిన చర్చలు జరిగి కొన్ని సమస్యల విషయమై ఒప్పందం కుదిరి, అంతా సవ్యంగానే వున్నా, ఈ ఇద్దరిలో ఏ ఒక్కరు కాశ్మీర్ నుగూర్చిన ప్రసక్తిని మాత్రం తేలేదు. అయితే, ఆ సమస్యను గూర్చి చర్చించడానికి విషయం ఏమీ లేక ఇట్లా జరిగిందని మాత్రం అనుకునేందుకు వీలులేదు. సమితిలో చైనా ప్రతినిధి డా॥ సియాంగ్ (అప్పుడు భద్రతా సంఘం అధ్యక్షుడు) తానై స్వయంగా కాశ్మీర్ విషయమై కొన్ని సూచనలు చేసివున్నారు. ఆసూచనలకు ఆధారమైన సూత్రమాత్రం ఇండియాకు తృప్తికరమైనదిగా కూడా వున్నట్టే అయివుండే. కాని, దురదృష్టం ఏమోగాని, [illegible] సంఘంలో నిలువ లభించే టంకానికి ఆయన [illegible] వ్యవహారం చెడిపోయి, ఇండియాపాకిస్తాన్‌ల మధ్య ఇంకా వైరుధ్యాన్ని అధికపెంచుతావున్న భయం, రాజీకి ఇప్పుడు వున్న ఈకొంత సావకాశాన్ని గూడా లేకుండా చేయగలవన్న అనుర్గా బయలుదేరాయి. ఇదంతా మాస్తే లేక్ సక్సెస్‌లో వ్యవహారం కొంచెను వరిపించే పద్ధతిలో ఎక్కడో పెద్దలోపం వున్నట్లు అనిపిస్తూ వుంటుంది.

ఈసారి సమితికి పోతున్న భారత ప్రతినిధివర్గంలో వార్తాదిక ప్రచారాల విషయం చూచేందుకుగాను శ్రీ బి. ఎల్. శర్మను ఒక సభ్యుడుగా వేసుకున్నారు. ఇది ఎంతో ఉచితమైనపని. ఇప్పటికే ఈప్రచార విషయం వట్ల ఎంతో అశ్రద్ధ వహించడం జరిగింది. శర్మకు అంతా అయిపోయిందనుకున్న తర్వాత కబురు వచ్చింది. బట్టలు అన్నీసర్దుకోడానికి గూడా ఆయనకు వ్యవధి లేదు. అందులోనే సందుచూసుకొని, నేను అమెరికాలో ఎరుగున్న కొంతమంది పేర పరిచయపత్రాలు వ్రాసి ఆయనకు అందజేశాను. శర్మ తనవిధిని నిర్వహించడంలో అరమరికలు చూపడని నాకు ఎప్పుడూ విశ్వాసంవుంది. ఈ సారి ఈ ప్రతినిధివర్గంలోంచి షేక్ అబ్దుల్లాను తగ్గించారు. ఆత్మప్రత్యయ మేయంగా వుండే ఆయన ఉపన్యాస వైఖరి సమితి ప్రతినిధులను గానీ, అమెరికా ప్రజలను గాని రంజింపచేయ లేకపోయింది. ఇక వచ్చి చెప్పడం అన్నది అచ్చట లేనేలేదు. అంతా సూచిరారా అంటే కొల్పుడువచ్చే వ్యవహారంగా పరిణమించింది.

సమితిలో కాశ్మీర్ ను గూర్చి జరుగుతున్న ప్రచారంలో ఒకమాటాతో విధురపరివర్తనం తోచినట్లు కన్పిస్తున్నది. ఇండియా చేసిన ఫిర్యాదును ఏదో చేసేద్దామన్న ఉద్దేశం మనస్సులో పెట్టుకొని జఫ్రుల్లాఖాన్ లార్డ్ మౌంట్ బాటెన్ పేరును గూడా రచ్చకెక్కించాడు. ప్రచారంలో దేన్ని అమెరికన్లు "పాత్రిహననం" అన్న పేరున పిలుస్తారో, దానికి జఫ్రుల్లా ఈ సందర్భంలో ఒడిగట్టాడు. పాకిస్తాన్ ప్రతినిధి ఎట్టి అభాండాలను విసిరాడో, వాటికి తగిన సమాధానం ఇచ్చే అవకాశం మౌంట్ బాటెన్‌కు, తాను అప్పుడు నిర్వహిస్తున్న ఉద్యోగ ధర్మాన్ని బట్టి సాధ్యం కాకుండా పోతున్నది. ఆ సంగతి తెలిసే జఫ్రుల్లా అట్లా చేసాడు. దీన్నే అమెరికనులు "పాత్రిహననం" అంటారు.

ఈ విషయాన్ని గూర్చి మేమంతా సాకల్యంగా చర్చించాం. జఫ్రుల్లా ఆరోపణలకు తన ప్రత్యుత్తరంఏమిటో, సమిష్టిరక్షణ సంఘంరికార్డులలో కనిపించేలాగున చేయాలని మౌంట్ బాటెన్ నిశ్చయించుకోవడం ఎంతో వుచితంగా వుంది. ఈ పని ఆ సంఘం రద్దుకాక ముందు జరగాలి. అప్పుడు అసలువిషయం ఏమిటో ఇండియా పాకిస్తాన్ ప్రభుత్వాలు రెండింటికి తెలిసివస్తుంది. తాను వైస్రాయిగా వున్న సందర్భంలో గూడా ఏ మెమోచేసినట్లు జఫ్రుల్లా అభాండాలు విసిరివున్నందువల్ల, ఆ అసలుసంగతి బ్రిటిష్ ప్రభుత్వానికి గూడా తెలిసేటట్లు చెయ్యాలి. ఎందుచేతనంటే, వైస్రాయిని మాట అనడం అంటే బ్రిటిష్ ప్రభుత్వాన్ని గూడా ఇరికించడమే.

### జఫ్రుల్లా ఆరోపణలు - ఖండన

జఫ్రుల్లా చేసిన ఆరోపణలన్నింటి లోను ముఖ్యమైనవని చెప్పతగ్గవి రెండువున్నాయి. అవిభక్త భారత దేశానికి వైస్రాయిగావున్న మౌంట్ బాటెన్, సిక్కులపథకం ఏమిటో తెలిసికూడా అల్లరిమూకలను అణచాలని గాని, వారి నాయకులను అరెస్టు చేయాలని గాని ప్రయత్నించలేదు. వారు అట్లా చేస్తారని జూలైలోనే ఆయనకు తెలుసు. అందువల్లనే, వారు అట్లాచేసే, అణుస్తానని హామీ ఇచ్చికూడా, దాన్ని పాలించడం మానుకున్నాడు.

సిక్కుల సమస్యనుగూర్చి, దాన్ని పరిష్కరించ వలసిన ఆవశ్యకతను గూర్చి ప్రభుత్వంలో పనిచేస్తున్న పైతలకాయలకు అందరికి తెలిసిన విషయమే అయినా, వారు (అంటే ఆ సిక్కులు) ఏదో రాక్షసి పథకాన్ని ఒకదాన్ని పన్నుకున్నారనితనకు గాని, మరి ఇంకా ఎవరికిగాని ఎంత మాత్రం తెలియదు అని మౌంట్ బాటెన్ ఈ విషయమై తాను తయారుచేసిన మెమొరాండంలో స్పష్టం చేసారు. నిజానికి అసలు ఇట్టి పథకం అంటూ సిక్కులకు ఒకటి వున్నట్లు ఆగష్టు 9 వ తేదీ నాడుగాని మౌంట్‌బాటెన్‌కు తెలియలేదు. ఆ రోజున ఒక బ్రిటిష్ గూఢచారి ఆయనకు ఈ విషయాన్ని తెలియజెప్పాడుగాని, అందుకు నిదర్శనంగా తగిన సాక్ష్యాన్ని చూపించలేక పోయాడు. ఆ పథకం కార్యక్రమం ఎంతఎత్తున సాగుతుంతో, ఆ కార్యక్రమ విధాన వైశిష్ట్యం ఏమిటో తెలియజెప్పే ఉపపత్తులుకూడా ఆ ఉద్యోగికి లభించలేదు. ఇదిగాక ఆగస్టు 9 వ తేదీనాడు జెంకిన్స్ ఒక ఉత్తరం వ్రాసారు. అందులో ఆయన, విభజన అనంతరం రెండు పంజాబులకు గవర్నర్లుగా నియమితులైన వ్యక్తులు కలిసి సమాలోచించి, తేల్చినసారాంశాన్ని వివరించారు. పంజాబు విభజన పూర్తిఅయి, అధికారం దత్తం అయిపోయేదాకా 'వీరిని అరెస్టు చేయవచ్చు, వారిని అరెస్టుచేయవచ్చు' అని ఆలోచనలు చేయడం వినా, ఆ ఆలోచనలు కార్యరూపం దాల్చేందుకు ఎంతమాత్రం వీలులేదని జెంకిన్స్ తేల్చినసారాంశం. అట్టి ఆలోచనలను విభజన పూర్తి అయిన మరుక్షణంలో రెండు పంజాబుల్లోను అమలు జరుపవచ్చు. ఇప్పుడు మౌంట్ బాటెన్ తన మెమొరాండంను ఈ విషయాన్ని ఆధారంగా తీసుకుని రచించారు.

ఈ సందర్భంలో పాకిస్తాను పంజాబు గవర్నరుగా నియమితుడైన మూడీ, ఏమి వ్రాసారోగూడా తెలుసుకుంటే మరికొంత బాగుంటుంది. వచ్చిన విశేషమేమిటంటే, మూడీకి జెంకిన్స్ పథకం నచ్చలేదు. తూర్పు పంజాబులో సిక్కులను ఏమీ చేయక ఒక పశ్చిమ పంజాబులోనే ఈ అరెస్టులు, అన్నీ జరిగితే, పరిస్థితి చాలా అసహ్యంగా తయారౌతుందని ఆయన అభిప్రాయపడ్డారు. మూడీ లెక్క అంతా జెంకిన్స్ పథకం అమలు జరిగిందా, రెండు పంజాబుల్లోనూ జరగాలి; లేకపోతే లాభంలేదు; అన్న ధోరణిలో వుంది. అదీకాక, సిక్కు నాయకులను అరెస్టు చేయడం అన్నది అంత తేలికఅయిన పనిగూడా కాదు. ఒకవేళ అరెస్టుచేసినా, గల్లంతులేకుండా వారిని ఎక్కడ నిర్బంధించి వుంచాలి? ఒక వేళ జెంకిన్సువారిని ఇప్పుడు అరెస్టుచేసినా, వారిని పాకిస్తాన్ క్రిందుకుపోయే పంజాబు భూభాగంలో బంధించి వుంచడం సాధ్యపడడం ఎట్లా? కాదు, తూర్పు పంజాబులోనే వుంచుతామంటారా, అచ్చట పెద్దఆందోళనకు అది దారితీయవచ్చు. ఈ విధమైన ఎన్నో అనుమానాలు మూడీ వెల్లడించారు.

### రాడ్‌క్లిఫ్ తీర్పు

మౌంట్ బాటెన్ మీద పాకిస్తాన్ చేసిన మరో ఆరోపణ రాడ్‌క్లిఫ్ అవార్డును గూర్చింది. వైస్రాయిగా వుండి దానిని ఆయన పాకిస్తాన్‌కు నష్టం కలిగే విధంగా మార్పించాడన్నది ఈ ఆరోపణలోని తాత్పర్యం. ఇందుకు పాకిస్తాన్, వైస్రాయ కార్యదర్శి ఏబెల్ పంజాబు గవర్నరు జెంకిన్సుకు వ్రాసిన ఉత్తరం ఆధారంగా చూపెంది. ఆ ఉత్తరంలో ఫిరోజ్‌పూర్, జీరా, తహసీల్లు పాకిస్తానుకు దక్కనున్నట్లు ఆయన జెంకిన్సుకు వ్రాశారు. రాడ్‌క్లిఫ్ తన అవార్డును ఎప్పుడు సమర్పించేది, దానిస్వరూపం ఎట్లావుండేదీ గూడా ఆయన ఆ ఉత్తరంలో వివరించారు.

ఏబెల్ వ్రాసిన ఈ వర్తమానం రాడ్‌క్లిఫ్ కార్యదర్శిద్వారా తెలిసింది. ఆకార్యదర్శి ఈయనకు ఉజ్జాయింపుగా తయారుచేసిన తీర్పును ఒకదాన్ని చూపించడంవల్ల ఇదైనా తెలిసింది. ఇక దీనిని ఏబెల్ జెంకిన్సుకు అందజేయడానికి ఒక కారణం వచ్చిపడింది. పోలీసులు, ఆ సైన్యం, ఇంకా ఇతర సిబ్బంది ఈ కొమాటాన్ని గూర్చిన చిక్కులను తేల్చితేల్చుకోడానికి వీలుగా రాడ్‌క్లిఫ్ తీర్పును గూర్చి తనకేమైనా తెలిస్తే ముందుగా కొంత కొంత తన చెవిని వేస్తూవుండవలసిందిగా జెంకిన్స్, ఏబెల్‌ను కోరి వున్నాడు. ఆ కోర్కెను ఈయన పాలించాడు. అయితే, ఆఖరికి ఇది తప్పని తేలిపోయింది. తీర్పులో, ఏబెల్ వ్రాసినట్లుగా లేదు. ఇంతకన్నా జరిగిన ఎక్కువ చిక్కులు గూడా ఏమీలేవు. జరిగిందంతా ఇది.

అయితే, ఏబెల్ వ్రాసిన ఈ ఉత్తరాన్ని చూపి, నిరాధారమైన ఈ ఆరోపణ చేయడంవల్ల అది నిజమేమోనన్న అనుమానం కల్గించడానికి వీలైనమాట నిజమే. కాని, అందులో ఏమన్నా రహస్యంవుంటే, జెంకిన్సు దాన్ని తన అనంతరం గవర్నరుగా వస్తున్న వానికి ఇచ్చిపోయేటంతటి పిచ్చివాడా? ఆ విషయాన్ని అట్లావదిలినా, తనతోటి బ్రిటిష్ ఉద్యోగులు ఈవిధంగా నష్ట ప్రతిష్ఠులైన కార్యకలాపాలకు ఇవి గట్టుబున్నట్లు సాక్ష్యాన్ని చూపించే ఉత్తరాన్ని, మూడీ తనచేతుల్లోంచి జారిపోనిస్తాడా? మౌంట్ బాటెన్ ప్రతిష్ఠను ఈవిధంగా కొడదనుకునేవారు పటేల్, రాడ్‌క్లిఫ్ అంతటి, [illegible] ఎవరో ఒక్కరైనా, నోరుమూసుకొని, లొంగిపోవడానికి [illegible] ఎవరన్నా వున్నారా?

## అర్జెంటైనాలో యుద్ధపరిస్థితి

### ప్రభుత్వంపై సైన్యోద్యోగుల తిరుగుబాటు

బ్యూనొస్ఎయిర్స్, సెప్టెంబరు 28: అర్జెంటైనాలో 'ముట్టడి పరిస్థితి' నెలకొన్నదని అధ్యక్షుడు జువాన్ పెరాన్ నేడు ప్రకటించారు.

ప్రభుత్వంపై జరిగిన తిరుగుబాటు విఫలమైనదని సూచిస్తూ, తిరుగుబాటు చేసిన సైన్యోద్యోగులకు మరణదండన విధించబడుతుందని అధ్యక్షుడు పెరాన్ హెచ్చరించారు.

ప్రభుత్వ యాజమాన్యంక్రిందవున్న అర్జెంటైన్ రేడియో అధ్యక్షుడు జారీచేసిన ఈ ఉత్తర్వులను ఆకస్మికంగా ప్రకటించినది. అనంతరం ప్రభుత్వ యాజమాన్యంక్రింద ఉన్న కార్మిక సమాఖ్య ప్రభుత్వ భవనానికి సమీపంగా సమావేశపలసినదని కార్మికులందరిని రేడియోద్వారా అభ్యర్థించినది. ఆ సమావేశంలో ప్రసంగిస్తూ, నేటి ఉదయం తనను హత్యచేయడానికి ప్రయత్నం జరిగినట్లు పెరాన్ వెల్లడిచేశారు. బ్యూనోస్ అయిర్స్ నగరానికి వెలుపల ఉన్న పాలొమార్ విమానకేంద్రం కూడా తిరుగుబాటుదారులలో కలసినదని సూచిస్తూ, ఆ విమానకేంద్రంపై దాడిజరిగినదని, తత్పరిణామంగా అది ప్రభుత్వానికి లొంగిపోయినదని అర్జెంటైన్ రేడియో ప్రకటించినది.

యుద్ధవిమానాల రాకపోకల వల్ల దేశంలో యుద్ధపరిస్థితి ఏర్పడినదని ప్రజలు తెలుసుకున్నారు. కార్మికులందరినీ సమ్మెచేయవలసినదని అభ్యర్థిస్తూ కార్మికసమాఖ్య ఇలా ప్రకటించినది :- "విద్రోహులు ప్రభుత్వంపై తిరుగుబాటుచేశారు. కార్మికులందరు వెంటనే సంఘటితపడి ఈ ప్రయత్నాలను ప్రతిఘటించాలి." మరి 14 రోజులలో అర్జెంటైనాలో ఎన్నికలు జరుగనున్నవి. ఇప్పటికి ఆరు సంవత్సరాలుగా పెరాన్ అర్జెంటైనా అధ్యక్షుడుగా వ్యవహరిస్తున్నారు.

## బొగ్గుగనుల నిర్వహణ సంస్కరణ

[ఆంధ్రపత్రిక విలేఖరి]

ఢిల్లీ, సెప్టెంబరు 28: బొగ్గుగనులను మితవ్యయంతో నిర్వహించుటకున్ను తక్కువ ఖర్చుతో ఎక్కువ బొగ్గును ఉత్పత్తిచేయుటకును, బొగ్గుగనుల వ్యవహార నిర్వహణ పద్ధతిని సంస్కరించుటకు ఇండియా ప్రభుత్వం సంకల్పించుకొన్నది. ఈ బొగ్గుగనుల వ్యవహారములను పరిశీలించుటకై వి. పి. సింగుగారి అధ్యక్షతను ఒక కమిటీ నియమింపబడెను. 1938-39 సం॥లో కంటె 1944-45 సం॥ బొగ్గుగనుల కార్మిక జనానికి యెక్కువ ద్రవ్యం జీతనాత్రింద ఇవ్వబడింది. కరువు బత్తెము హెచ్చుగా యివ్వబడుటవల్ల, వేతనం బట్వాడా హెచ్చింది. రైల్వే బడ్జెటు చర్చ జరిగినప్పుడు ఈ విషయం విమర్శింపబడింది. బొగ్గుగనులలో 6,000 మంది ఎక్కువజనం పనిలో నియమింపబడినట్లు వెల్లడింపబడింది. కాని వీరిలో చాలామంది నిజంగా పనిలో లేరు. కాని, కాంట్రాక్టర్ల మస్టరులో కొంతమందికి జీతాలిచ్చినట్లు బొగ్గుగనుల ఆసాములు ఖర్చు లెక్క అధికంగా చూపిస్తున్నారు. వి. పి. సింగుగారి కమిటీవారు బొగ్గుగనులలోని పనివారికి కనీసపు వేతన ప్రమాణం ప్రకారం సం॥ 1-కి రు. 1026 లు బట్వాడా చేయబడుతుంది. 9,000 మంది అదనపు కార్మిక జనానికి రూ. 9234000లూ సాలీనా ఖర్చుఅవుతుంది. ఈ బొగ్గుగనులను వ్యాపార సరళిగా లాభసాటి కంట్రాక్టు వేరంగా నిర్వహింపబడవలెనని పార్లమెంటు యిదివరలో హెచ్చరించి యుండెను.

ఈ పద్ధతిగా సంస్కరణచేస్తే చాలా అదనపు కార్మిక జనాన్ని లెక్కలో నుంచి తీసివేయడమవుతుంది. చాలామంది అదనపు కార్మికులు నిజంగా పనిలో లేరు గనుక, అట్టి అభూతకల్పిత జనాన్ని తగ్గించడంలో తగాదా ఏమీ ఉండదు.

## కాంగ్రెసు ప్రతికూలంగా సంఘటిత వామపక్షం

### నాగపూరు సర్వపక్ష సమావేశంలో ఏర్పాటు

నాగపూరు, సెప్టెంబరు 28: నిన్న ఇక్కడ జరిగిన కమ్యూనిస్టు, ఫార్వర్డు బ్లాక్, రైతుకార్మిక పార్టీల నాయకుల సభలో రానున్న యెన్నికలందు కాంగ్రెసును ప్రతిఘటించడానికని ఒక సంఘటిత వామపక్షం ఏర్పాటు చేయబడింది. ఈపక్షంవారి ఎన్నికల ప్రణాళిక త్వరలోనే వెలువడుతుంది.

# కార్మికభీమాసవరణబిల్లుకు పార్లమెంట్ సమ్మతి

## యజమానులవద్ద శ్రామికులవద్ద డబ్బువసూలు

ఢిల్లీ, సెప్టెంబరు 28 కార్మిక భీమాచట్టము క్రమక్రమంగా భారతదేశంలోని వేర్వేరు మహానగరములలో అమలు జరుపబడుతుంది. కార్మిక భీమాదల సవరణ బిల్లును నేడు పార్లమెంటు ఆమోదించింది.

ఈ భీమాచట్టము స్కీము 1948 సం॥లో తయారు చేయబడెను. కాని దానిని అనుసరించుటకు కొన్ని ప్రతిబంధకములు ఏర్పడినవి. ఈ ప్రతిబంధకములలో కష్టకరమైనటి ప్రతిబంధకమును తొలగించుటకై ఒక సవరణ చట్టము నిన్న యింకేసారి పార్లమెంటులో ఆమోదింపబడినది. కార్మికులు, వ్యాధిగ్రస్తులైనయెడలను, గర్భవతులై ప్రసవించుటకుగాను సెలవుపై కొన్న యెడలను, కర్మాగారములందు పనిచేయుసందర్భములో ప్రమాదమువల్ల గాయములు దెబ్బలు తగిలిన యెడలను యంత్రాగారపరిశ్రమలలో పనిచేయు కార్మికులకు యీ భీమా మొత్తంలో నుంచి సైకము యివ్వబడును.

ఈ భీమాకుగాను కార్మికుల వేతనములనుండి కొంత సైకము జమకట్టబడవలెను. యంత్రాగారముల యజమానులు మరికొంత సైకము వాయిదాలుగా జమకట్టుచుండవలెను. ఈ విధంగా ప్రతి కార్మికునకు భీమా ద్రవ్యనిధి యీరీతిగా ఏర్పడగలదు. ఈ భీమా విధానము ముందుగా ఢిల్లీలోను, కాన్పూరులోను 4 మాసాలు గడచిన తోడనే అమలు పరచబడును. యీ స్కీము ఇప్పుడు అమలులో లేనటువంటి యితర నగరముల లోని ఫ్యాక్టరీల యజమానుల వద్దనుండి కూడా వాయిదా మొత్తములు ఇప్పుడే వసూలు చేయుట ఆరంభమగును. ఇతర నగరాలలోని కార్మికులు మాత్రము ఆయా నగరాలలో ఈస్కీము అమలు పరచిన తేదీనుండి మాత్రమే తమ జీతాలనుండి భీమానిధికి వసూళ్లు యివ్వాలి. మొత్తమువిూద క్రమక్రమంగా 1958 సంవత్సరాంత్యమునకు దేశమంతటను గల యంత్రాగార పరిశ్రమలలోని కార్మికులకందరికి ఈ భీమా పద్ధతి వర్తింపజేయబడును. అప్పటికి 25 లక్షల కార్మికులకు ఈ భీమా సౌకర్యములు వర్తింపగలవు.

ఢిల్లీ నగరంలో పారిశ్రామిక యజమానుల మూలంగా సాలీనా రూ. 7 లక్షలు వసూలు కాగలదు. అచట కార్మికులవల్ల రు. 14 లక్షలు వసూలు కాగలదు. కాన్పూరులో యజమానుల వల్ల రూ. 18 లక్షలున్ను కార్మికుల వల్ల రూ. 25 లక్షలున్ను వసూలుకాగలదు. ఢిల్లీలోని పరిశ్రమల యజమానులున్ను కాన్పూరులోని పరిశ్రమ యజమానులున్ను వసూలు యివ్వవలసిన మొత్తములో కొంతభాగాన్ని దేశంలోగల యితర నగరాలలోని యంత్రాగార పరిశ్రమ యజమానులు ప్రస్తుతం భరించి చెల్లిస్తారు. యజమానులవల్ల వసూలయ్యే మొత్తము రూ. 120 లక్షలవరకు లెక్కతేలును ప్రతి కార్మికుని భీమాకు చేరవలసిన మొత్తంలో మూడోవంతు కార్మికుని వల్లను మిగిలిన మొత్తము యజమాని వల్లను వసూలుకావాలి. దేశం మొత్తం మీద కార్మికులవంతు మొత్తము రూ. 14 కోట్లు లెక్క తేలును.

ఈ భీమా వ్యాపారమునంతను చూచుచుండుటకై ప్రభుత్వ కార్మిక భీమాసంస్థ యొకటి వ్యవహరించును భీమాచేసిన కార్మికుల ఆరోగ్యాన్ని కాపాడుతూ ఉండేటందుకు యీ యీ భీమాసంస్థ ఢిల్లీలో 9 ఔషధశాలలను, ఒక సంచార ఔషధశాలను ఏర్పాటు చేయును. కాన్పూరులో 18 ఔషధశాలలు ఏర్పాటు చేయబడును.

## శృంగేరి జాగీరు

### రద్దుచేయవద్దని మైసూరు ప్రభుత్వానికి మహజరు

బొంబై, సెప్టెంబరు 27: ఎస్.ఎస్. సుబ్బిగారు అధ్యక్షులుగా ఏర్పడ్డ శృంగేరీ సంరక్షణ సంఘంవారు మైసూరు రాజ ప్రముఖుగారికి ఒక మహజరు సమర్పించారు. 600 ఏండ్లనుండి యావద్భారతము లోని హైందవులకు పూజనీయంగా నిలచివున్న యీశృంగేరీ మఠం తాలూకు జాగీరును కూడా ఇనాము రద్దుచట్టంక్రింద తొలగించవద్దని యీసంఘంవారు తమమహజరులో మైసూరు ప్రభుత్వాన్ని కోరారు. జాగీరు తొలగించినందువల్ల మఠం పోషణకు లోపము వస్తుందనీ, అట్టి స్థితి అసంఖ్యాకులుగా వున్న శ్రీశంకరాచార్య మఠంభక్తులకు సహింపరానిది కాగలదనీ హెచ్చరించారు. ఈ వరకే యీజాగీరులో రైతులకు దానవిక్రయాది హక్కులను యిచ్చివున్నారనీ, రైతుల పరిస్థితిని అభివృద్ధిపరచటానికి [illegible] ప్రభుత్వం చేయదలచుకుంటే, ఆ విషయం యిదివరకే శృంగేరీ జాగీరులో నెరవేరిందని విన్నవించారు.

## సహకార వ్యవసాయ పద్ధతివల్ల ప్రయోజనం

### ముఖ్యమంత్రి ప్రసంగం

మద్రాసు, సెప్టెంబరు 29 "సహకార సాగుపద్ధతివల్ల అధిక ఆహారాన్ని ఉత్పత్తి చెయ్యవచ్చు. ప్లానింగు కమిషనువారు ఈ తరహా సాగును ప్రోత్సహించదలిచారు. దక్షిణాదిన 25 వ్యవసాయక సంఘాలు 7120 ఎకరాలను సహకారపద్ధతిన సాగుచేస్తున్నాయి. సహకారపద్ధతిన సాగుచేసే మరికొన్ని సంఘాలు అవసరం. అప్పుడు అధికాహారోత్పత్తి లభించగలదు. సహకారరంగాన ఇతరులకు తమిళనాడు దీపస్తంభం కాగలదని ఆశిస్తున్నాను" అని మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ పూసపాటి కుమారస్వామి రాజాగారు నేటి ఉదయం పచ్చయప్ప కాలేజీలో 8 వ తమిళరాష్ట్ర సహకార సమావేశాన్ని ప్రారంభిస్తూ చెప్పారు. డా॥ పి. నటేశన్ గారు స్వాగతమిస్తూ సహకార రంగంలో రాజకీయాలు తీసుకు రాకూడదన్నారు. సభాధ్యక్షత వహించిన ఎ. రామచంద్రపిళ్లెగారు సహకారవాదులు దీక్షతో కృషి చేసి దేశానికి ప్రయోజనం కలుగచేయాలన్నారు.

సభను ముఖ్యమంత్రి ప్రారంభిస్తూ చిత్తశుద్ధిగలవారు సహకారసంస్థలను నిర్వహించిన నాడే వాటివల్ల సంపూర్ణ ప్రయోజనం ఉండగలదన్నారు. ఆక్షేపణ వచ్చిన వెంటనే దాన్ని విచారించవలసి ఉంటుందనీ, సహకారపద్ధతిన గృహవసతి క్రమముల వృద్ధిచెయ్యాలని, భూమితనఖాబ్యాంకులు రైతులకు సద్వినియోగం చేసేట్లు అధికధనాన్ని అందు వెచ్చించాలనీ చెప్పారు. టి. ఎ. రామలింగచెట్టి గారు సహకారవాదుల విధులుగూర్చి చెప్పారు

## ఆహార ధాన్యాల ధరల పెంచాలి

### ఆహారమంత్రి ప్రకటన

మద్రాసు, సెప్టెంబరు 19 "ఆహారధాన్యాల ధరల పెంచవలెనని మద్రాసు ప్రభుత్వం త్వరలో కేంద్రప్రభుత్వానికి సూచిస్తుంది" అని మద్రాసు ప్రభుత్వ ఆహారమంత్రి రోక్ విక్టోరియాగారు నేడు పత్రికా ప్రతినిధులతో చెప్పారు.

ఆహారమంత్రి ఈవిధంగా చెప్పారు: "మాజిల్లాగా ధరలు పెంచవలెనని కోరుతున్నాం. యీ ఏడాది గూడా కోరుతున్నాము. అక్టోబరులో ఆహారమంత్రుల సమావేశం గూడా జరగవచ్చు. అక్టోబరు ఆఖరు వారంలో ధరలు నిర్ణయమౌతుంది: ధరలు తక్కువగా ఉన్నందున ఇప్పుడు వాణిజ్య పంటలు వేసే భూమిమీద ఆ పంట తగ్గించి ఆహార ధాన్యాలు పండించవచ్చు. పైగా ఈ రాష్ట్రంలో ధరలు చాలా తక్కువగా ఉన్నాయి ధరలు పెంచితే ధాన్యసేకరణ గూడా హెచ్చుగా జరుగగలదు."

ప్రభుత్వం వారిచ్చే ఆహారధాన్యాల సప్లయి అంకెలు పరస్పరవిరుద్ధంగా ఉన్నాయని సూచించగా మంత్రిగారు విచారించగలమన్నారు

## రిడ్జివే ప్రతిపాదనపై కమ్యూనిస్టుల విమర్శ

టోకియో, సెప్టెంబరు 29: సమితి సర్వసైన్యాధిపతి జనరల్ రిడ్జివేచేసిన కొత్త ప్రతిపాదనకు కమ్యూనిస్టు సైన్యాధిపతులు ఇంకా సమాధానం పంపలేదు. కొరియాయుద్ధ విరమణ సంభాషణలను కేసాంగులో కాక ఉభయసైన్యాల ఆక్రమణలో ఉన్న ప్రాంతాల మధ్యభాగంలోసొంగ్యోనికు వద్ద కొనసాగించాలంటూ రిడ్జివే ప్రతిపాదించారు.

అమెరికా సైన్యాధిపతుల వర్గాధ్యక్షుడు జనరల్ బ్రాడ్లీ ఈరోజున జనరల్ రిడ్జివేతో సంప్రదింపులు ప్రారంభించారు.

మరొక కొత్త ప్రదేశంలో యుద్ధవిరమణ రాయబారాలు కొనసాగించాలని ప్రతిపాదించడం ద్వారా రాయబారాలు ఆలస్యం అయ్యేటట్లు చేయడానికి రిడ్జివే ప్రయత్నిస్తున్నాడని చైనా దళాధ్యక్షుడు జనరల్ [illegible] విమర్శించారు. రిడ్జివే ప్రతిపాదనపై ఇతర పత్రికల విమర్శను కూడా పెకింగు రేడియో ప్రచారం చేసినది. రాయబారాలు కేసాంగులోనే జరగాలని, ఆ ప్రాంతపు తటస్థ్యం భగ్నం కాకుండా చేయడానికి తగిన్నట్టు కట్టుదిట్టం చేయాలనీ కమ్యూనిస్టులు ఇంకా వాదిస్తున్నారు.

ఈ రోజున కమ్యూనిస్టు సైన్యాలు కేంద్ర రంగంలోను, చోర్వాన్ కుమ్వాంగ్ ప్రాంతాలలోను పోరాటాలు జరిపారు. కేంద్ర రంగంలో సమితి బలాలు వెనుకంజ వేసినవి

ఆంధ్రపత్రిక * సారస్వతానుబంధం

1951 సం॥ సెప్టెంబరు 30-వ తేదీ, ఆదివారము






# పూజ్య గాంధిజీ జన్మదినోత్సవం

## అక్టోబరు 2వ తేదీ

మహాపురుషుల జన్మదినాలను పండుగ దినాలుగా పరిగణించటం మనకు పరిపాటి. రామకృష్ణాద్యవతారాలు ప్రభవించిన శ్రీరామనవమి, కృష్ణాష్టమి మొదలైన రోజులను ఎలా జాతీయ పర్వదినాలుగా పరిగణించుతున్నామో, అలాగే, ఈనాడు, మహాత్ముని జన్మదినాన్ని కూడా పరవడి దినంగా పరిగణించుతున్నాం. లోకకళ్యాణార్థం జీవితాన్ని వ్యయించి పూర్ణపురుషులుగా జీవించిన మహామహులందరి జన్మదినాలూ మనకు పర్వదినాలే. వారి మహాదాశయాలను సంస్మరించి తరించటానికి మనం పండుగలు చేసుకుంటున్నాం. కాని, దురదృష్టవశాత్తూ, కాలగమనంలో, ఈ పండుగలకు ఉండే పరమార్థం విస్మృతిపథాన పడి, లాంఛన ప్రాయంగా, ఇంటికి వెల్ల వేయించుకొని యిల్లాలిచేత పిండివంటలు చేయించుకు తినటం క్రింద పరిణమించి వూరుకుంటుంది. మహాత్మునితో కలిసి బ్రతికిన ఈ తరంవాళ్లమైనా, జాతిపిత జన్మదినోత్సవానికి అలాంటి దుస్థితి పట్టకుండా చూడటం మన కనీసధర్మం.

మహాత్ముని భౌతిక దేహం అదృశ్యమైపోయినా, అమరమైన ఆయన సందేశం మన కళ్లెదుట మెసులుతూనే వుంది. ఆయన సందేశం వాగ్రూపంలో ప్రవచింపబడ్డది కాదు. ఆయన ఉత్కృష్ట జీవితమే మానవజాతికి పరమసందేశం. ఆయన జన్మదినం, ఆయన జీవిత సంస్మరణా, యుగయుగాల మానవ జాతికి నైతికోజ్జ్వలమైన ప్రబోధగీతం.

గాంధిజీ జీవితాశయమేమిటి?— ఈ ప్రశ్నను గాంధిజీని సరిగా అర్థం చేసుకోలేని వారిని యెవర్నైనా అడిగితే, 'భారతదేశ దాస్య విముక్తి'— అనే సమాధానం రావచ్చు. కాని అలాంటిది సత్యలేశమే కాని పరిపూర్ణ సత్యం కాదు. మానవజాతి విముక్తి ఆయన పరమాదర్శం. పీడననుంచీ, దారిద్ర్యంనుంచీ, అజ్ఞానంనుంచీ, మానసిక సంక్షోభంనుంచీ సర్వమానవజాతిని సముద్ధరించటానికి మహాత్ముడు తన జీవితాన్ని పణంగాపెట్టి పోరాడారు. మానవుడు మానవుణ్ణి పీక్కుతినే కిరాతంనుంచి ప్రపంచాన్ని ఉద్ధరించటానికి ఆయన జీవితమంతా యిడుములు పడ్డారు. ఆ మహాదాదర్శాన్ని అందుకోటానికి ఆయన అధినూతనమయిన ఒక సాంఘిక వ్యవస్థను సూచించారు. అహింసా సూనృతములు ఆ నూతన వ్యవస్థకు జీవనాడులు.

కేవల సిద్ధాంతాలుగా ఈ సూత్రాలను ఎంతటివారు మెచ్చుకోనివారంటూ వుండరు. కాని, ఈ మెచ్చుకోళ్ళన్నీ కేవల వాగ్రూపంలో వినిపించుతున్నాయేగాని—ఆచరణకు తేవాలనే అభిలాష శూన్యం. ఈ సూత్రాలు ఆచరణ సాధ్యాలు కావనే అజ్ఞానభోగజనిత అవిశ్వాసం యీ నైతికపతనానికంతకీ మూలకారణం. ఇది చాలా ప్రమాదకరమైన మనోభావన. అనటం నిస్సంకోచమైన విషయం. అంతేకాదు— మహాత్ముని పేరిట సంఘాన్ని మోసగించాలనే నీచాతినీచమైన అభిప్రాయం దీనిలో యిమిడివుంది. అలాంటిది సాంఘిక విద్రోహమే గాక ఆత్మఘాతం వహితం.

అందుచేత, అహింసా సూనృత వ్రతులను శిరసావహించి తీరాలని శపథం తీసుకోగలిగితేనే, మనం గాంధీజీ జన్మదినోత్సవాన్ని జరపుకోటానికి అర్హులం; లేదా, మన్నిమనం మోసం చేసుకుని యితరులను మోసం చేయటానికి పూనుకోకుండా అలాంటి ఉత్సవ కార్యక్రమాల ప్రమేయం లేకుండా దూరంగా తొలగివుండటం ఉత్తమం.

పరస్పర సహకారం వుంటేనే గాని ఉత్తమ తరగతి సమాజాన్ని నిర్మించటానికి వీల్లేదు. సమాజంలోని ప్రతి ఒక్కడూ సత్యప్రియుడైతేనే గాని సహకారమంటూ దుర్లభం. సత్యప్రియత్వం ఒక్కటే చాలదు. సహనశీలతను అలవరచుకొని తోటివారి సమస్యలను, అభిప్రాయాలనూ ఉదారంగా అర్థం చేసుకోగలగాలి—అంటే అహింసా వ్రతాచరణ సిద్ధించాలి. ఇలాంటి పరమోత్కృష్టమైన జీవిత విధానాన్ని అలవరచుకోవాలంటే— త్యాగశీలురం కావాలి.

సూక్ష్మంగా ఇదే మహాత్ముని జీవిత స్వరూపం—అహింసా సూనృతములు పరమాదర్శములు గాగల త్యాగమూర్తి గాంధిజీ జన్మదినోత్సవవేళ ఆయన అడుగుజాడలలో నడిచి, ఆయన అనుయాయులమని చెప్పుకోగల శక్తి నివ్వవలసిందిగా కోరుతూ మనం భగవంతుణ్ణి ప్రార్థించవలసివుంది. —అరుణ



## గాంధిజీ చిత్రాలతో పోస్టుకార్డులు

మహాత్ముని జన్మదినోత్సవాలను పురస్కరించుకుని భారతప్రభుత్వ తపాల శాఖవారు, మహాత్ముని చిత్రాలు గల పోస్టుకార్డులను వెలువరించుతున్నారు అక్టోబర్ 2-వ తేదీ లగాయతూ వీటిని విక్రయించుతారు






గీతాపారాయణం :—కథలసంపుటి రచయిత శ్రీగోపీచంద్ ప్రచురణ దేశకవితా మండలి విజయవాడ 2 ఇందులో స్వయంపాకం, గీతాపారాయణం, స్వార్జితం, వెంకటచలం పాత్ర, వంక, సంపెంగ పువ్వు, భార్యాలోలుడు, మాతృప్రేమ, పతివ్రత అంతరంగికం అనే కథలు ఉన్నవి వెల ప్రచురింపబడలేదు

భార్యల్లోనే ఉంది —కథల సంపుటి రచయిత శ్రీ గోపీచంద్ దొరుకుచోటు దేశ కవిత మండలి విజయవాడ 2 వెల ప్రచురింపబడలేదు ఇందులో భార్యల్లోనే ఉంది, సిగ్గు, బస్సు ఆగింది పోయింది భూతదయ, పాపిష్ఠి సంపం, పీకి తన్నాడయం, హిందూ పాతివ్రత్యం, పాపాయి యిల్లు భార్యాభర్తలు, మనకవి, పుస్తకాలు అమ్మేవాడు, పెద్దలకుద్దులు, ఆడమల యాశం, నేనూ నాపాత్ర, స్పర్థ అనే కథలు ఉన్నాయి

దేశం ఏమయ్యేట్టు —కథలసంపుటి రచయిత శ్రీగోపీచంద్ ప్రచురణ దేశ కవితామండలి విజయవాడ వెల ప్రచురింపబడలేదు ఇందులో దేశం ఏమయ్యేట్టు కార్యకారుడు అకారణం, పిరికివాడు, ధర్మవడ్డీ, భయం, ఇలా జరిగేను, బీదవాళ్లంతా ఒకటి, గోడమీదనుండి పోవాడు అనేకథలున్నాయి

...న్నాయి ఈ కథలన్నీ విభిన్న సంఘటనలలోని, విభిన్న చరిత్రలు గల, విభిన్న మానవ మనస్తత్వాల చిత్రణ మాత్రమేనని రచయిత చెప్పారు

మద్రాసు మునిసిపాలిటీస్ త్రైమాస ఆంగ్లపత్రిక ప్రారంభ సంచిక మా కార్యాలయమునకు చేరినది దీనిసంపాదకులు డా॥ టి వి ఎస్ చలపతి రావుగారు ఇందులో మద్రాసు మునిసిపాలిటీల పరిపాలనకు సంబంధించిన సమస్యలపై వ్యాసములున్నవి వి పి ఎస్ సుబ్రహ్మణ్యపిళ్లై, టి కె రామ, ఎస్ కె పాటిల్ మున్నగు ప్రముఖుల రచనలు ఉన్నవి ఇతర దేశాలలో స్థానిక పరిపాలనా వ్యవహారములు ఏవిధంగా నడుస్తున్నా యీ తెలియజేసే వ్యాసాలను కూడా ముందు ముందు ప్రచురిస్తామని సంపాదకులు ప్రకటించారు

### శ్రీ స్వామి శివానంద సరస్వతి

రచయిత శ్రీ సుబ్బయ్య నాయుడు గారు బి ఎ బి ఎల్ అడ్వకేట్, వెంకటగిరి, నెల్లూరుజిల్లా పుటలు 120 వెల రూ 2-0-0 ప్రాప్తిస్థానము దివ్యజీవన సంఘము, వెంకటగిరి టవును

జ్ఞానియు, బహుగ్రంథ రచయితయు అగు శ్రీ శివానంద సరస్వతి చరిత్రమును, ఉపదేశములను శ్రీ నాయుడుగారు చక్కని తేట తెలుగు భాషలో రచించియున్నారు పూర్వాశ్రమములో కుప్పుస్వామి అనునామము వహించిన శ్రీ శివానందులు, తిరునల్వేలిజిల్లా...

